శ్రీరస్తు

# శ్రీమదనన్తస్తవః

శ్రీసేవావ్యాఖ్యా సమేతః



మూలము

ఉభయవేదాన్తవాచస్పతి, వాచస్పతి

ఉ.వే.శ్రీమాన్ కె.ఎస్. రామానుజాచార్యస్వామివారు

అధ్యక్షులు, ఉభయవేదాన్తసభ

వ్యాఖ్యాత

ఉ.వే.శ్రీమాన్ ఈ.ఏ. సింగరాచార్యస్వామివారు

ప్రకాశకులు

## ఉభయవేదాన్తసభ

పెంటపాడు-534 166

2002.

శ్రీరస్తు

# శ్రీమదనన్తస్తవః

శ్రీసేవావ్యాఖ్యా సమేతః



మూలము

ఉభయవేదాన్తవాచస్పతి, వాచస్పతి
ఉ.వే.శ్రీమాన్ కె.ఎస్. రామానుజాచార్యస్వామివారు
అధ్యక్షులు, ఉభయవేదాన్తసభ
వ్యాఖ్యాత
ఉ.వే.శ్రీమాన్ ఈ.ఏ. సింగరాచార్యస్వామివారు

ప్రకాశకులు
ఉభయవేదాన్తసభ
పెంటపాడు-534 166
2002.

# శ్రీమదనన్తస్తవః

కె.ఎస్. రామానుజాచార్యులు

శ్రీసేవావ్యాఖ్యా

ఈ.ఏ. సింగరాచార్యులు



ప్రథమముద్రణ: 8-11-2002, నాగులచవితి-కార్తీకమాసం-చిత్రభాను సంవత్సరం

ప్రతులు: 1000

మూల్యము: 10 రూ.లు

ప్రతులకు

1. ఉభయవేదాన్తసభ
   పెంటపాడు. ప.గో.జిల్లా.
   పిన్: 534 166. ఫోను: (08818) 223963.

2. సాధన గ్రంథమండలి
   తెనాలి-522 201

3. శ్రీ కె.యస్. రామానుజాచార్యులు, Retd. Principal,
   భువనేశ్వరి అగ్రహారం,
   మూలాపేట, నెల్లూరు

డి.టి.పి. ముద్రణ:

ఉభయవేదాన్తసభ.

ప్రవచనశిరోమణి, మహామహోపాధ్యాయ
ఉ.వే.శ్రీమాన్ భాష్యం అప్పలాచార్య స్వామివారు
షీలానగర్, విశాఖపట్టణం

## అనంతస్తవము

నిత్యసూరులలో ప్రధానంగా పేర్కొనబడేవారు అనంత, గరుడ, విష్వక్సేనులు, ఆ అనంతునకే అతని శరీరమును వివిధముగా మలచి సర్వేశ్వరునికి ఉపయోగపడునట్లు చేయుటచే శేషుడు అను నామధేయము కలిగెను. దీనిని యామునాచార్యులవారు 'నివాసశయ్యాసనపాదుకాంశుక **ఉపధాన వార్షాతపవారణాదిభిః'** అని చెప్పినారు. శేషుడను నామము అనంతునకు వారు చేసిన సేవలకు అనుగుణముగా వచ్చినది. చరాచరము లన్నియూ భగవానునకు శేషభూతములే. అందు మొదటివాడు కనుక ఈయనకు **'ఆదిశేషుడు'** అను పేరు వచ్చినదట. అట్టి అనంతుని యొక్క స్వరూపరూపగుణములను వివరించుచూ **వాచస్పతి, ఉభయ** వేదాంతప్రవర్తక, **శ్రీమాన్ కె.యస్.రామానుజాచార్యులవారు అనంతస్తవము** రచించిరి. ఇది పరిమాణములో చిన్నదే. కాని గంభీరమైన భావములను, ఆ అనంతుని స్వరూపరూపగుణములను వివరించునదై వెలసినది. ఇందు చమత్కారముగా ఎన్నో విషయములు ప్రతిపాదింపబడినవి. శ్రీమాన్ రామానుజాచార్యులవారు గొప్ప పండితులు, ఉభయ వేదాంత నిష్ణాతులు. వారి ప్రతిభ, వ్యుత్పత్తులు అనన్య సామాన్యములు. అందరు తప్పక చదవవలసిన స్తోత్రము.

దీనికి వారి భాగినేయులు శ్రీమాన్ శింగరాచార్యులవారు వ్యాఖ్యను వెలయించిరి. స్తోత్రమునకు ముందు పీఠికను వారే అనుగ్రహించిరి. ఆ పీఠిక ఎన్నో విషయములను నిరూపించినది. వ్యాఖ్యానము చేత స్తోత్రము,

స్తోత్రము యొక్క గంభీరార్థవిశదీకరణము చేత వ్యాఖ్య 'వలయేన మణిః మణినా వలయః' అనునట్లు ఒకదానికి ఒకటి శోభను తెచ్చినవి. శ్రీమాన్ శింగరాచార్యులవారు విమర్శకులు, పండితులు, రచయితలు అగుటచే పీఠిక వ్యాఖ్యలో కూడ ఎన్నో రహస్య విషయములను, సంప్రదాయ విషయములను నిరూపించినారు. ఆ గ్రంథమునకు ముందు మాట వ్రాసే భాగ్యము నాకు లభించినది. దానిచే నేను ఎన్నో విషయములను ఎఱుంగ గలిగితిని. ఇట్టి అవకాశము కలిగించిన శ్రీమాన్ శింగరాచార్యుల వారికి సర్వదా కృతజ్ఞుడను. ఇట్టి సంప్రదాయవిశదీకరణప్రధానమగు స్తోత్రమును, వ్యాఖ్యను అందరు చదివి, ధన్యులగుదురు గాక!

ఇట్లు
భాష్యం అప్పలాచార్యులు

శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయ నమః

# ప్రస్తావన

**శయ్యాసనముఖై రూపై స్సకలై శ్శేషతాం గతైః ।**
**శ్రీశాయ కురుతే సేవాం శేషాయ మహతే నమః ॥**

## భారతీయ సంస్కృతి-నాగారాధన

భారతదేశము అత్యంత పవిత్రమైన,విశిష్టమైన, సనాతనమైన సంస్కృతికి, ధర్మమునకు, పలుఆరాధనలకు నిలయము . ప్రకృతిలోని పర్వతాద్యచేతనములలో కూడ దైవాంశను దర్శించి, కొలిచిన భారతీయులు పలురీతులలో ప్రత్యేకతలను కల నాగములను ఆరాధించుటలో వింత ఏమియును లేదు. కాని Ferguson వంటి పాశ్చాత్య విమర్శకులు కొందఱు నాగారాధన ప్రాచీనార్య సంస్కృతికి చెందినది కాదని, ప్రాయశ: అది ద్రావిడ సంస్కృతి ప్రభావమువలన ఆర్యసంస్కృతి లో ప్రవేశించి యుండునని వాదించుచు, అందులకు ఉపోద్బలకముగా ఆర్య సాహిత్యములో మిక్కిలి ప్రాచీనముగా భావింపబడు ఋగ్వేదములో ఎచటను నాగారాధన ప్రసక్తి లేకుండుటను పేర్కొనిరి. ఈ వాదము ఎంతమాత్రము పసలేనిదని J.Ph.Vogel వంటి విదేశీయ పండితులు సహేతుకముగా నిరాకరించుచు, అందులకు ప్రముఖ నాగవిశేష బోధకములైన నామపదములన్నియు ఆర్యభాషామూలకములగుటవంటి పలు నిదర్శనములను చూపిరి. Vogel పండితుడు “Indian serpent” అను గొప్ప ఆంగ్లగ్రంథములో ఈ విషయమును ప్రస్తావించుచు- “In this connection it may be noted that the mystic snake - kings bear personal names which almost invariably are not Dravidian, but purely Aryan-“అని విశ్లేషించుట గమనార్హము. ఈ నాగారాధన భారతమున సర్వత్ర విస్తరించుటయే కాక ఇండోనేషియా, చైనా, జపాన్, శ్రీలంక, బర్మా వంటి ఇరుగు పొరుగు దేశములందును వ్యాపించినది. ఇందులకు భారతీయ సంస్కృతి ప్రభావమే కారణమని తలచు విమర్శకులును పలువురు కలరు. ఈ నాగారాధన ప్రభావము కేవలము వైదిక సంప్రదాయమునందే కాక, బౌద్ధసంప్రదాయమున, తన్మత గ్రంథములలో, జాతక కథలలో విస్తృతముగా కలదు. భారతములోని నాగారాధనకు, నాగములకు సంబంధించిన పలు

అంశములను Vogel పండితుడు అద్భుతముగా వివరించి, విశ్లేషించెను. ఇవియే కాక ఇంకను లనేకములైన అంశములు వేద ఇతిహాస పురాణాదులలో కానవచ్చు చున్నవి. వీనిలో కొన్ని మాత్రము ఇచట స్థాలీపులాకన్యాయమున సంగ్రహముగా ప్రస్తావింపబడుచున్నవి.

**వేదములలో నాగముల ప్రస్తావన :** ఋగ్వేదములో ప్రస్తుతము నాగారాధన ప్రసక్తి స్పష్టముగా కనిపించుటలేదను కారణముతో ఈ ఆరాధన ఆర్యసంస్కృతిలో భాగముకాదనుట యుక్తిసహము కానేరదు. మనకీనాడు ఋగ్వేదము పూర్తిగా లభించుటలేదనుట అందఱు అంగీకరించినదే. అట్లయిన,నాగారాధన ఋగ్వేదమున పూర్తిగా లేదనుట ఎట్లు సాధ్యము?

మఱియు, ఋగ్యజురాది భేదములు కాలగమనమున ఒకదాని తరువాత వేరొకటిగా ఏర్పడినవి కావు. అవి సమాంతరముగా అభివృద్ధి చెందినవే. ఋగ్వేదములో నాగారాధన కనిపించకున్నను, యజుర్వేదములోని మైత్రాయణీ శాఖలో గల ఈ క్రింది సర్పారాధన సూక్తము ఆ కాలమునాటి నాగారాధనకు ఒక చక్కని తార్కాణము.

నమో అస్తు సర్పేభ్యో యే కే చ పృథివీ మను,
యే అంతరిక్షే యే దివి తేభ్యః సర్పేభ్యో నమః,
యా ఇషవో యాతు ధానానాం యేవా వనస్పతీగ్ం రను,
యే వాఽవటేషు శేరతే తేభ్యః సర్పేభ్యో నమః,
యేఽదో రోచనే దివో యే వా సూర్యస్య రశ్మిషు,
యేషా మప్సుసదః కృతం తేభ్యో స్సర్పేభ్యో నమః.

అథర్వణ వేదములోని ఇట్టి భావమునే తెలుపు వేరొక సూక్తమును గమనింపుడు.

యే అగ్నిజా ఓషధిజా అహీనాం యే అప్సుజా విద్యుత అబభ్రవః
యేషాం జాతాని బహుధా మహాంతి తేభ్య స్సర్పేభ్యో నమసా విధేమ

(10-4-23). పై సూక్తములను బట్టి నాగజాతి భూమినుండి, నీటినుండి, అగ్నినుండి, ఓషధులనుండి, విద్యుత్తునుండి పలురీతులలో పుట్టునని, భూమ్యాంత రిక్ష పాతాళ దేవలోకాదులలో సర్వత్ర వర్తించునని భావించిట్లు ఏర్పడుచున్నది. అథర్వణ వేదములో కానవచ్చు పలు సర్ప నివారణ సూక్తములును ప్రస్తుతమున స్మరణీయములు. వానిలో మచ్చునకు రెండు :-

పరిద్యామివ సూర్యో జూహీనాం జనిమాగమ్ ।
రాత్రీ జగదవా న్యద్ధం సాత్తేనా తే వరయే విషమ్॥ (6-12-1.)
అవశ్వేతపదాజ హి పూర్వేణ చాపరేణ చ ।
ఉదప్లుతమివ దార్వహీనా మరసం విషం వారుగ్రమ్॥ (10-4-3.)

నాగుల పుట్టుక - గరుడునితో వైరము : మహాభారతము ఆదిపర్వ ప్రారంభములో నాగులు కద్రువకు కశ్యపప్రజాపతివలన కల్గిన సంతతిగా తెలువబడినది. ఈ కద్రువ దక్షుని కుమార్తె. కద్రువ అనగా గోరోచన వర్ణమును కల్గినదని అర్థము. ఈమె భూమికి ప్రతీక అని కొందఱి విమర్శకుల అభిప్రాయము. శ్రీరామాయణము సుందరకాండ ప్రారంభమున హనుమానుడు సముద్రమును దాటునపుడు అతని బలిమిని పరీక్షించుటకై దేవతల పనుపున సురస ఎదురువచ్చెను. ఈ సురస అచట "సురసాం నాగమాతరమ్" అని నాగమాతగా పేర్కొన బడినది. సురస అనగా చక్కని రసమును కల్గినది అని అర్థము. "రసా విశ్వంభరా" ఇత్యాదిగా రసా అనునామము భూమివాచకము. మేదినీనిఘంటువును "స్త్రీ రాస్నా నాగ మాత్రోశ్చ" అని సురసను నాగమాతగా పేర్కొన్నది. కద్రువ దక్షుని కుమార్తె అయినట్లే సురసయు దక్షుని కుమార్తెగా తెలియుచున్నది. హనుమానుడు ఆమెను "దాక్షాయణి నమో-స్తుతే" అని స్తుతించెను కదా! దీనిని బట్టి కద్రువ - సురసలు ఒకే వ్యక్తికిగల రెండు నామములా? లేక వీరిరువురూ వేర్వేరు వ్యక్తులా? ఇద్దరునూ నాగమాతలేనా? కల్పభేదముతో సమాధానింపవలెనా? అనునది విజ్ఞులైన పెద్దలవలన తెలియదగిన అంశము. కద్రువ అదితిశాపమువలన రోహిణిగా పుట్టెనని బ్రహ్మవైవర్తపురాణమున కలదు. ఆదిశేషాంశతో ఆవిర్భవించిన బలరాముడు రోహిణికి కుమారుడగుట గమనింపదగినది. మఱియు వేరొక అంశమును ఇచట ప్రస్తావనార్హము. అమరకోశములోని వనౌషధి వర్గలో "సురసా" అను పేరుగల ఓషధి ఒకటి కలదు. దీనికి నాగసుగంధా అని గంధనాకులీ, నాకులీ, నకులేష్టా, అని, భుజంగాక్షీ, అనియు పర్యాయములున్నట్లు అచట తెలుపబడినది. అనగా సర్పాక్షి అనుబడు ఈ ఓషధి సర్పగంధమును కల్గినదని, ఆ గంధముచే ముంగిసలకు ఇష్టమైనదని, దీని పూవులు సర్పనేత్రములవలె నుండునని అర్థము. ఈ ఓషధి ఆయుర్వేదమున "నాకులీ" శబ్దముతో ప్రసిద్ధము. ఇది సర్పవిషహరము. జంగమవిషమును స్థావర విషము హరించును. కావున ముంగిస పాముచే కఱువబడినపుడు ఈ ఓషధిని తిని, తనను రక్షించుకొనునట.

ఈ విధముగా సురసాశబ్దమునకు నాగములతో అవినాభావ సంబంధము కలదని తెలియుచున్నది.

పాశ్చాత్యదేశములందును పూర్వము నాగజాతి భూమి సంతానమను భావనయే ఉండెడిది. ఈజిప్టు దేశములోలో (Egypt) సర్పములు భూమి పుత్రులుగా భావింపబడిరి. ఇట్టి నమ్మకమే గ్రీస్, జెర్మనీలోని ప్రాచీనకథా సాహిత్యమునందునను కలదని Vogel మహాశయుడు నుడివెను. రామాయణము ఉత్తరకాండలో సీతాదేవిని తనలోనికి కొనిపోవుటకై వచ్చిన భూదేవి ఆసీనురాలైన సింహాసనము నాగములచే మోయబడుట భూమికి నాగములకు మధ్యగల సంబంధమునకు వేరొక ఉదాహరణ అని ఆధునికవిమర్శకుల అభిప్రాయము. సర్పరాజగు ఆదిశేషుడు భూమిని మోయుట ఇతిహాస పురాణాదులలో స్పష్టము. భూమి - నాగముల మధ్యగల ఈ అవినా భావసంబంధమే నాగములు భూమిలో నిక్షిప్తములైన నిధులను రక్షించునను భావనకు మూలకారణము అని కొందరు పాశ్చాత్య విమర్శకులు తలచిరి.నాగములు నిధులను రక్షించుట పంచతంత్రాది గ్రంథము లందేకాక, బౌద్ధకథా సాహిత్యమునందును ప్రచురముగా కనిపించుచున్నది.

నాగులకు గరుడజాతికి మధ్య జాతివైరము ఏర్పడుటకు, నాగుల నాలుక చివర రెండుగా చీలియుండుటకు నాగుల కారణమునకు సంబంధించిన కథ మహాభారతములోని ఆదిపర్వ ప్రారంభములో కలదు. కశ్యపుని వేరొక భార్యయగు వినతకు అనూరుడు, గరుడుడును పుత్రులుగా జన్మించిరి. కద్రువ కపటోపాయముతో వినతను తన దాసిగా చేసికొనుటచే ఆమె పుత్రుడగు గరుడుడును నాగులకు దాస్యము చేయవలసివచ్చెను. (ఈ కారణము చేతనే ఆమెకు కద్రువ అను నామము సార్థకమని తోచును. కుత్సితం ద్రాతీతి కద్రూః, ద్రా - కుత్సాయాం గతౌ అనువ్యుత్పత్తి ఇచట వివక్షితము). అప్పటినుండి గరుడుడు నాగులపై వైరము పెంచుకొనెను. తల్లిదాస్యమును పోగొట్టనెంచిన గరుడుడు కద్రువ కోరికను అనుసరించి, స్వర్గమునుండి అమృతమును తెచ్చి నాగులకిచ్చెను. అంతటితో వినతాగరుడుల దాస్యము తీరెను. ఇంతలో ఇంద్రుడు వచ్చి ఆ అమృతమును స్వర్గమునకు కొనిపోవుపుడు అమృతకలశము ఉంచిన దర్భలపై ఒకటి, రెండు బిందువులు చిందినవి. వానిని నాకుటకై ప్రయత్నించిన నాగులు అప్పటినుండి ద్విజిహ్వులయ్యెను. నాలుకను మాటిమాటికీ బయటపెట్టు అలవాటునుబట్టి నాగులు వాయువును భుజించునను భావన కల్గెనని ఆధునిక విమర్శకుల తలంపు.

కావుననే వానికి పవనాశనములని పేరు కల్గినది. కాళ్ళు లేకున్నను అత్యంత వేగముగా చలించుట, చెవులు లేకున్నను ఎంత చిన్న సవ్వడియైనను వినగల్గుట, భూమిలో, నీటిలో, పర్వతములలో, అంతట నివసింపగల్గుట ఇత్యాది పలు అంశములు నాగములను మానవాతీతశక్తులను కల్గినవిగా భావించుటకు హేతువులైనవి అనియును విమర్శకుల అభిప్రాయము.

**నాగములు కుబుసమును విడచుట :** తనశరీరముపైనున్న చర్మపుపొఱ పాతబడి నపుడు సర్పము దానిని విడచుట అలవాటు. నాగజాతికి చెందిన ఈ అంశము నాగములు నిత్యయౌవనమును కల్గినవని తలచునట్లు చేసినది. ఇందుకు నాగులు పూర్వము చేసిన ఒకానొక యాగమే కారణమని తాండ్యమహాబ్రాహ్మణము (25-15) పేర్కొన్నది. ఈ యాగము ధృతరాష్ట్ర-ఐరావత-తక్షకాది పలునాగ ప్రభువుల సమక్షమున జరిగినట్లును అందుకలదు.

పాము కుబుసమును విడచు అంశము పలురీతులలో నిదర్శనముగా గ్రహింప బడినది. ప్రశ్నోపనిషత్తు యోగులు ప్రాకృత శరీరమును వీడి మోక్షమును పొందుటకు ఉపమానముగా దీనిని నిర్దేశించినది. **"యథా పాదోదర స్త్వచా వినిర్ముచ్య త ఏవం హ వై స పాప్మనా వినిర్ముక్త: సా సామభి: రున్నీయతే ........"** (5-5) ఇత్యాది వాక్యమిచట అనుసంధేయము-ఇట్టి భావన ఐతరేయబ్రాహ్మణమున (6-1), మహాభారతమునందును కలదు. శ్రీరామాయణము సుందరకాండలో ఈ అంశము క్రోధాది దోషములను త్యజించుటకు ఉపమానముగా **"య స్సము త్పతితం క్రోధం క్షమయైవ నిరస్యతి, యథోరగ: త్వచం జీర్ణామ్"** (55-7) అనుచు వాల్మీకి భగవానుడు తెలిపెను. ఋగ్వేదమునందును **"అహి ర్నజూర్ణామతి సర్పతి త్వచ మత్యో నక్రీళ న్న సర ద్వృషా హరి:"** (9-86-44) అను సూక్తమందు సోమలతనుండి జాలువారు సోమరసమునకు ఉదాహరణముగా అనుసంధింప బడినది. పాముకు కుబుసమునకు రోగనివారణగుణములు, అతీంద్రియశక్తులును కలవని పూర్వము నమ్మబడెడిది. సర్పదష్టుడైన వ్యక్తియొక్క చితాభస్మముతో నిండిన కృష్ణసర్పముయొక్క కుబుసమునకు అదృశ్యరూపమును కలుగచేయుశక్తికలదని కౌటిల్యుని అర్థశాస్త్రమున (14-3) తెలుపబడినది.

సర్పము విశ్రమించునపుడు కుండలాకారముగ తన శరీరమును చుట్టు కొని యుండును. కావున కుండలియని, చక్రి అను పేర్లు సర్పమునకు కల్గినవి. నాగజాతియొక్క ఈ స్వభావము వేదాంతశాస్త్రమున అచిత్పదార్థము లన్నియు

వరబ్రహ్మయొక్క ఆకార విశేషములే అని (పూర్వపక్షముగా) వాదించుటకు ఉపమానముగా గైకొనబడినది. ఈ విషయమును "ఉభయ వ్యపదేశా త్త్వహికుండల వత్" (3-2-26) అను బ్రహ్మసూత్ర మున గమనింపవచ్చును. అట్లే, నిదురలేచిన సర్పము పైకిలేచుట యోగశాస్త్రమున జీవునిలో నిద్రాణమైయున్న కుండలినీశక్తి యోగసాధనద్వారా ఉద్బుద్ధమై సుషుమ్నానాడిద్వారా బ్రహ్మరంధ్రమును చేరుటకు ఉపమానముగా గ్రహింపబడినది.

**నాగఫణములపై గుర్తులు :** నాగముల పడగలపై పాదములవంటి గుర్తులుండు టకు కాళియమర్దన వృత్తాంతమును హేతువుగా భాగవతాది పురాణములు పేర్కొనుచున్నవి. కాళింది మడుగును విషపూరితమునుచేసిన కాళియుని శిక్షించుటకై శ్రీకృష్ణుడు ఆ మడుగులో ప్రవేశించి కాళియుని పడగలపై నాట్యమాడెను. అప్పటినుండి నాగములు పడగలపై శ్రీకృష్ణుని పాదలాంఛనములను కల్గియున్నవి. ఆగుర్తులను కల్గియుండుటచే కాళీయునకు గరుడునివలన భయముకలుగదనియు శ్రీకృష్ణభగవానుడు వరమిచ్చినట్లు "**యద్భయా త్సుపర్ణ స్త్వాం నాద్యా స్మత్పద లాంఛనమ్**" (10-16-63) అను భాగవత సూక్తివలన తెలియుచున్నది. బౌద్ధ సాహిత్యము ఈఅంశమును ఇంకొకవిధముగా వివరించినది. ముచివిందుడను నాగరాజు బుద్ధునకు తనపడగలను గొడుగాచేసి ఎండ వేడిమినుంచి రక్షణను కల్పించెనని,దానికిగుర్తుగా అప్పటినుండి నాగములపడగలపై బుద్ధుని అనుగ్రహ చిహ్నముగా అతని పాదముద్రలు ఏర్పడినవని తెలుపబడినది.

విష్ణుపురాణ, హరివంశాదులలో ఈ గుర్తు స్వస్తిక పదముచే, స్వస్తికార్థ పదముచే నిర్దేశింపబడినది. శుభలక్షణమని అర్థమిచ్చు ఈ పదములు నాగజాతి పవిత్రతకు సూచకములని Vogel వంటి విదేశీయపండితుల అభిప్రాయము. "Quite Possibility, it may have contributed to the sanctity of the animal which was supposed to bear of " అను అతని వివరణము స్మరణీయము.

**నాగజాతిభేదములు :** నాగజాతిలో పలుప్రకారములుకలవు. కొన్ని ఒకేపడగను కల్గినవి కాగా, మరికొన్ని అనేక ఫణములను కల్గినవి. భగవద్గీతలోని "**సర్పాణా మస్మి వాసుకిః**" అను సూక్తిలోని సర్పశబ్దము ఒకేపడగనుకల నాగములను, "**అనంత శ్చాస్మి నాగానామ్**" అను సూక్తిలోను నాగశబ్దము పలు శిరస్సులనుకల నాగములను తెలుపునని భగవద్రామానుజులు గీతాభాష్యములో వివరించిరి. అట్లే, కొన్ని

కామగమనమును, కామరూపమును కల్గినవి. మహాభారతములోని ఉత్తంకోపాఖ్యానములో తక్షకుడు క్షపణక రూపములో ఉత్తంకునివద్దగల కుండలములను హరించుట, ఉత్తంకుడతనిని పట్టుకొనబోగా అదృశ్యుడై, నాగ రూపమునుదాల్చి, భూవివరముద్వారా పాతాళలోకమును చేరుటయు ఈ అంశములను నిరూపించుచున్నది. సర్పములు అనేకములైనను వానిలో అనంత తక్షక కర్కోటక వాసుక్యాది ఎనిమిది సర్పములు ప్రధానములని ఆగమములలో కలదు.

**సర్పవిష నివారణోపాయములు** : పాముకాటుకు పాముకాటే మందు అను విశ్వాసము పూర్వము ప్రచురముగానుండెడిది. బుద్ధుని జాతక కథలలో ఒకచోట విషవైద్యుడు సర్పదష్టుడైన వ్యక్తిని మరల ఆసర్పము కఱచునట్లు చేయుటద్వారా రక్షించుటకు ప్రయత్నించెనని కలదు. పామువిషమునకు ఆ పామువిషమే విరుగుడు అను ఈ భావము పూర్వము యూరప్ దేశములో కూడ ఉండెడిదట. సర్పవిషమును నివారించు విధానములను గూర్చి ఆయుర్వేద శాస్త్రములోని అష్టాంగములలో ఒకటి అగు కల్పస్థానము తెలపుచున్నది. అగదతంత్రమునందు పలువిషముల నివారణనుగూర్చిన వివరములు కలవు. సుశ్రుతాదులును పలు నివారణములను తెలిపిరి. జంగమవిషమునకు స్థావర విషము, స్థావరవిషమునకు జంగమవిషమును నివారకమని ఆయుర్వేదము పేర్కొనుచున్నది. పాము కఱచినపుడు ముంగిస దానికి విరుగుడుగా "నాకులీ ఓషధి" తినునని ఇంతకుముందే తెలుపబడినది. ఇది జంగమ విషమునకు స్థావర విషము నివారక మనుటకు ఉదాహరణము. మహాభారతములో భీమునకు పెట్టిన విషాన్నము ప్రభావమును పోగొట్టుటకై పాతాళ లోకములోని సర్పములు కఱచునట్లు చేయుట స్థావరవిషమునకు జంగమవిషము నివారక మనుటకు ఉదాహరణము. ఇవియేకాక, మంత్రప్రయోగముద్వారా, గరుడ -నాగమణుల ద్వారా విషమును నివారింపవచ్చును. విషమును నివారించు ఓషధులను గుర్తుపట్టుశక్తి ముంగిసలకేగాక సర్పములకును కలదనుటకు అథర్వణ వేదము – "సర్పాగంధర్వా యా విదుస్తా అస్మాఅవనే హువే" (8–7–23) ఇత్యాది సర్పనివారణ సూక్తమున తెలిపినది.

**నాగమణి** : నాగమణిని గూర్చి ఇంచుక ఇచట ప్రస్తావింపబడుచున్నవి. వరాహమిహిరుడు బృహత్సంహితలో (81–25) తక్షక –వాసుకి వంశములకు చెందిన నాగములకు, కామగమన శక్తినికల నాగములకును తలపై ఈమణి

ఉండునని తెలిపెను. (అమరకోశవ్యాఖ్యలో వాసుకి నామము "వసు: రత్నం కే శిరసి యస్య స: వసుక:, తస్యాపత్యం వాసుకి:" అని వివరింపబడుటచే వాసుకి శిరోరత్నమునుకల నాగవంశమునకు చెందినట్లు స్ఫురించుచున్నది.) దీనికి విషమును నివారించు శక్తి కలదు. నాగము రత్నమును కల్గియుండునను నమ్మకము ఇంచుక భేదముతో సింహళదేశమునను ఉండెడిది. వారి నమ్మకమును బట్టి ఈ మణి పడగపైకాక, కంఠములో ఉండునని, సర్పము చీకటిలోనున్న వస్తువును చూడదలచినపుడు ఆ మణిని బయటకు తెచ్చుకొనునని ; పనిపూర్తికాగానే మరల కంఠములోనికి కొనిపోవునని వారి విశ్వాసము. పాశ్చాత్యదేశములందును, పూర్వము Dragon, Aspis, Idros జాతికి చెందిన సర్పములు ఈ మణిని కలిగి యుండునని భావింపబడెడిది. కాని తరువాతి కాలమున (మధ్యయుగమున) Toad అను మండూకవిశేషము ఇట్టి మణిని కల్గియుండునని తలవబడెనని పల్కుచు అందులకు నిదర్శనముగా Vogel పండితుడు షేక్స్పియర్ మహాకవి రచించిన As you like It అనురూపకములోని-"Like the Toad, ugly and Venamous wears yet a precious Jewel in his head"(Act II Scene I-13 -14) అనువాక్య ముదాహరించెను.

ఇంద్రధనుస్సు - నాగమణుల సంబంధము : ఆకాశములో కనిపించు ఇంద్రధనుస్సుకు పుట్టలోనున్న నాగముల పడగలపైగల మణుల కాంతులే కారణమని పూర్వము నమ్మబడెడిది. వరాహమిహిరుడు బృహత్సంహితలో (54వ అధ్యాయము) ఆకాశము మేఘావృతమై యున్నపుడు సూర్యకిరణములకు వాయుచే ఒత్తిడి కల్గినచో, అవి ఏడురంగులుగా విడివడి, ఇంద్రధనుస్సు ఏర్పడునను వివరణములను తెలుపుచు, కొందఱి అభిప్రాయము బట్టి అనంతుని వంశమునకు చెందిన నాగముల మణులు కాంతులచే ఏర్పడునని పల్కెను. మేఘసందేశములోని 'వల్మీకాగ్రాత్ ప్రభవతి ధను:ఖండ.మాఖండలస్య'(15) అను సూక్తిని వ్యాఖ్యానించుచు వల్లభదేవుడు సర్పగర్భములైన వల్మీకముల కారణముగా ఇంద్రధనుస్సు ఏర్పడు ననగా, వేరొక వ్యాఖ్యాత, పాతాళములోనున్న వాసుకి శిరస్సుపైగల రత్నముల కాంతులు వల్మీకములద్వారా పైకి ఎగయుటచే ఇంద్రధనుస్సు ఏర్పడుననెను. మనదేశములోని భావనలు ఇట్లుండగా, ఇంగ్లాండు దేశములో పూర్వము బాలురు ఇంద్ర ధనుస్సు భూమికి తాకుచోట బంగారము, రత్నములు నిక్షిప్తములై యుండునని తలచి, అందులకై అన్వేషించుచుండిరని Vogel తెలిపెను. "కుళు" లోయ

ప్రాంతములో ఇంద్రధనుస్సుకు "బుధీనాగన్" అనిపేరు. ఈ పేరుకు వృద్ధనాగమని అర్థము.

**నాగలోకవైభవము :** పదునాల్గులోకములలో అధోలోకములుగా చెప్పబడు ఏడులోకములలో చివర లోకము పాతాళము. ఇదియే నాగలోకము. ఇది స్వర్గమును మించిన వైభవమును కల్గినది. కావుననే భోగవతిఅని పేరు కల్గినది. నారదమహర్షి పాతాళలోకవైభవమును ఆశ్చర్యచకితుడై సందర్శించి, స్వర్గమునుచేరి అచట విశేషములను దేవతలకు తెల్పు వృత్తాంతము విష్ణుపురాణములో కలదు. అట్లే, భాగవతములోని 5వ స్కంధమున, పద్మపురాణములోని పాతాళఖండమునను పాతాళలోకవైభవము విస్తృతముగా ప్రతిపాదితము.

**నాగముల అతీంద్రియ శక్తులు :** నాగములు అమానవశక్తిని కల్గినవని, అట్టి శక్తులను ప్రదానముచేయుటలో సమర్థములని బుద్ధుని జాతక కథలలో తెలుప బడినది. సేనకుడను రాజు తన మిత్రుడగు ఒకానొక నాగమువలన మహిమాన్విత మైన మంత్రమునునేర్చి, జంతుభాషను నేర్చెనని అందు కలదు. కథాసరిత్సాగరము (46-121) లో ఒకముని ఆదేశానుసారము ఒకానొకరాజు సర్పములుగల చెఱువులో ఏడుదినములు నివసించి, ఆ సర్పముల విషమును సహించి, మోహినీశక్తిని పొందెననియుకలదు. ఇవియేకాక, కొన్ని నాగములు అద్భుతకళా నైపుణ్యమును కల్గినవని చిత్రలక్షణమను గ్రంథములో కలదు. మహాకాలుడను నాగము అశోకుని ప్రార్థనపై ఉన్నతములైన బుద్ధవిగ్రహములను నిర్మించెనని అందు తెలుపబడినది. బౌద్ధసంప్రదాయములో నాగములు పవిత్రములైన వస్తువులను రక్షించునను నమ్మకమున్నది. బుద్ధుని అవశేషములు, పవిత్రగ్రంథములును నాగములచే వారిలోకమున చిరకాలము కాపాడబడెనని బౌద్ధుల విశ్వాసము. నాగార్జునుడు పుట్టిన పిమ్మట నాగములు అతనిని తమ లోకమునకు ఆహ్వానించి ఆగ్రంథములను అందజేసినవనియును చెప్పబడుచున్నది.

**నాగకన్యలు- సంబంధబాంధవ్యములు :** నాగలోకము అత్యంతము సుందరమై నట్లే , నాగకన్యలును సాటిలేని మేటి అందముగలవారు. లంకలో రావణుని మందిరమునగల నాగకన్యలను హనుమానుడు"నాగకన్యా: వరారోహా: పూర్ణచంద్ర నిభాననా:"అని పొగడెను. నాగకన్యలను వివాహమాడినవారును ఇతిహాస పురాణాదులలోగలరు. శ్రీరాముని కుమారుడగు కుశుడు కుముద్వతి యను నాగకన్యను పరిణయము జేసికొనెను. అర్జునుడు ఉలూపిని పరిగ్రహించిన కథ

ప్రసిద్ధము. అట్లే, జరత్కారువు అనుముని అదేపేరునుకల నాగకన్యను వివాహము చేసికొనెను. ఇట్టి వృత్తాంతములు భూరిదత్తజాతకము అను బౌద్ధగ్రంథములో, కల్హణుని రాజతరంగిణిలో పలు కలవు.

నాగులకు మూలపురుషులుగాకల వంశములు పలుచోట్ల కలవు. కల్హణుని రాజతరంగిణి ప్రకారము క్రీ.శ. 8వశతాబ్దిలో కాశ్మీరు దేశమును పాలించిన లలితాదిత్యుడు కర్కోటకుని వంశమున పుట్టినరాజు. ఛోటానాగపూర్ ప్రాంతమును ఏలిన ప్రభువుల మూలపురుషుడు పుండరీకుడను నాగరాజు. మణిపూర్ ప్రాంతములోని ప్రభువులును నాగవంశమునకు చెందినవారే. ప్రతిష్ఠానపురమును పాలించిన శాలివాహనుడు అనంతుని వంశమువాడు. అటే, పల్లవులును నాగజాతికి చెందినవారుగా చెప్పబడుచున్నారు. ఈ విషయము కొన్ని శాసనములలో కలదు. ప్రాచీనకాలమున కాంబోడియా దేశమును హైందవ ప్రభువులు పాలించిరి. వారి మూలపురుషుడు కౌండిన్యుడను బ్రాహ్మణుడు. అతడు సోమ అను నాగకన్యను వివాహమాడెను. వం.గదేశములోని కాయస్థులతెగవారు వాసుకిని మూలపురుషునిగా కలవారు. ఈ విషయమున విస్తృత పరిశోధన చేసిన M.J.Dr. Zyluski అను పాశ్చాత్య విమర్శకుడు తూర్పుదేశములలోని పలు ప్రాంతములలో నాగులను మూలపురుషులుగా గల వంశములు అనేకములు కలవని తేల్చెను.

**నాగులకు ముఖ్యదేవతలతోటి సంబంధము :** త్రిమూర్తులలో స్థితికారకుడగు విష్ణువు పాలసముద్రమున నాగశయనముపై పవళించును. పరమపదమున ఆదిశేషుని ఆసనముగా కల్గియుండును. పరమశివుడు నాగాభరణుడు. సూర్యుని రథమున కట్టబడిన పగ్గములు సర్పములు. గరుడుడు కర్కోటకాది అష్టవిధ సర్పములను భూషణములుగా కల్గియుండునని ఆగమములు తెలుపుచున్నవి. విఘ్నేశుని మొలనూలు సర్పమే. ఇట్లు పలువురు దేవతలతో నాగములకు అవినాభావ సంబంధము కలదు.

**లోకకళ్యాణములో నాగములు :** బ్రహ్మదేవుని ఆజ్ఞచొప్పున ఆదిశేషుడు భూభారమును తన పడగలపై మోయుచున్నాడు అని మహాభారతము తెలుపు చున్నది. త్రిపురాసురసంహారమున అతడు శివుని వింటిదారమయ్యెను. వాసుకి క్షీరసాగరమథనములో రజ్జువుగా సహాయపడెను. కర్కోటకుడు నలచక్రవర్తికి సహాయపడగోరి అతనిని కఱచెను. ఇట్లు పలు సందర్భములలో నాగముల సౌజన్యము, లోకకళ్యాణతత్పరతయు స్పష్టపడుచున్నవి. కద్రువ పన్నిన మాయో

పాయమును అనంత వాసుకి - తక్షకాది సర్పములు వ్యతిరేకించిన సందర్భము ఇచట స్మరణీయము.

**నక్షత్రాధిదేవతలుగా నాగములు :** జ్యోతిశ్శాస్త్ర ప్రకారము అశ్వనీ నక్షత్రము మొదలు రేవతి వరకుగల 27 నక్షత్రములకు ఆయా దేవతలు అధిదేవతలుగా కలరు. ఈ క్రమములో ఆశ్రేషా నక్షత్రమునకు అధిదేవతలు సర్పములు. ఈ అంశమును క్రింద ఉదాహరింపబడిన అష్టక వాక్యములు తెలుపుచున్నవి.

**"ఇదగ్ం సర్పేభ్యో హవి రస్తు జుష్టమ్, ఆశ్రేషా యేషా మనుయంతి చేతః**
**యే అంతరిక్షం పృథివీం క్షియంతి, తేన స్సర్పాసో హవమాహమిష్ఠాః**
**యే రోచనే సూర్యస్యాపి సర్పాః యే దివం దైవీ మనుసంచరంతి**
**యేషా మాశ్రేషా మనుయంతి కామం, తేభ్యః సర్పేభ్యో మధు మజ్జుహోమి".**

లక్ష్మణుడు ఆదిశేషాంశతో అవతరించెనని పద్మపురాణములోకలదు. "సార్పే జాతస్తు సౌమిత్రిః" అనుట ద్వారా వాల్మీకి భగవానుడు లక్ష్మణుడు సర్పదేవతాక నక్షత్రమగు ఆశ్రేషలో జన్మించెనని సూచించెను. ఇచట కవి ఆశ్రేషా నక్షత్రనామమును నేరుగా నిర్దేశింపక, తదధిష్ఠాన దేవతయగు సర్పముయొక్క సంబంధమును పల్కుట గమనార్హము.

**నాట్యశాస్త్రములో నాగముల ప్రసక్తి :** నాట్యశాస్త్రములందును నాగముల ప్రాధాన్యము కలదు. నాగబంధమను నృత్తబంధము, నాగబంధ హస్తమను హస్త సన్నివేశమును ఇందులకు కొన్ని ఉదాహరణములు. నాగము ఆడువిధమున నర్తకీ నర్తకులు నాట్యమాడుట ప్రత్యక్ష్యానుభవసిద్ధము. ఇట్టి నాట్యము మిక్కిలి కష్టము.

శ్రీరంగములో శ్రీరంగనాథుని ఉత్సవమూర్తిని వృషభ-సింహ-శార్దూల -గజగతులలో ఊరేగించుట పరిపాటి. ఈ నాల్గుగతులతో పాటు సర్పగతియు వేరొకటి కలదు. స్వామి విగ్రహమును గర్భాలయములోనికి కొనిపోవునపుడు ఇట్టి సర్పగతిలో కొనిపోవుదురట. ఈగతిని సేవించుట అత్యంతము దుర్లభము.

**అలంకార శాస్త్రములో నాగోపమానములు :** అలంకారశాస్త్రమున నాగములు ఉపమానములుగా పల్కు కవిసమయములు పెక్కులు కలవు. నాయకుని బాహువులను సర్పభోగముతో పోల్చుదురు. "బాహుం భుజగభోగాభమ్" అనుచు వాల్మీకి మహర్షి ప్రయోగించెను. విశాలమైన వక్షఃస్థలము యొక్క వెనుక భాగమును (వీపును) పాము పడగతో ఉపమింతురు. భగవద్రామానుజుల అభిషేక గద్యలోని

"తిరువనన్దాళ్వాన్ పిన్పడమ్ పోలే నడుప్పదిన్దు పరన్దు నెతిత్తిట్ట తిరుముదుగుమ్" అను సూక్తి స్మరణీయము. అనంతుని పడగవెనుక భాగము వలె నడుములో అదుమబడి, విస్తరించి, ముందుకు వంగియున్న వీపు వెనుక భాగము స్త్రీల జడను కృష్ణసర్పముతో పోల్చుదురు.హస్తమును పాముపడగతో ఉపమింతురు."పంచాంగులీ పంచశిర:" అని శ్రీరామాయణసూక్తి. స్త్రీల నితంబప్రదేశమునకు పాముపడగ ఉపమానమనుటకు తిరుప్పావైలోని "పుత్తరవల్కుల్" అను ప్రయోగము ఉదాహరణము. తెల్లని, సన్నని, మృదువైన వస్త్రమును పాము కుబుసముతో పోల్చుదురు ఇవియేకాక, బంధకవిత్వములో నాగబంధమును కలదు. ఈ బంధము పలురీతులలో కన్పించుచున్నది. ప్రస్తుత స్తుతిలో అట్టి బంధవిశేషమొకటి ప్రదర్శింప బడినది.

**యుద్ధతంత్రములో నాగములు :** నాగముల శక్తి నిక్షిప్తములైయున్న, మంత్రాత్మక మైన యుద్ధసాధనమునకు నాగాస్త్రమని పేరు. ఇట్టి నాగాస్త్రమును ప్రయోగించి ఇంద్రజిత్తు రామలక్ష్మణులను నాగపాశబద్ధులను చేసెను. యుద్ధవ్యూహములలో సర్పాకారముగా రచింపబడు సర్పవ్యూహమొకటి. ఇట్టి వ్యూహము కురుక్షేత్ర సంగ్రామములో ప్రయోగించబడినది. పగకు, ప్రతీకారమునకు మారుపేరైన నాగములను పూర్వము కొందఱు రాజులు తమ ధ్వజచిహ్నముగా గ్రహించెడివారు. దుర్యోధనుని ధ్వజ చిహ్నము నాగమే. ఈ విషయము "మహాన్ దుర్యోధనస్యాసీ న్నాగో మణిమయో ధ్వజ:" (భారత-భీష్మ-17-26) అను ప్రమాణము వలన తెలియుచున్నది.

**ఆభరణములలో సర్పాకృతులు :** ఆభరణములలో కొన్ని నాగముల ఆకారమున చేయబడును. వానిలో నాగరము, నాగవంకి మొదలగునవి అట్టివి. కంచిలోని వరదరాజస్వామి, తిరుమలలోని వేంకటేశ్వరుడును నాగాకారములోనున్న ఆభరణములను కల్గియున్నారు.పరమేశ్వరుడు సర్పాభరణుడుగదా!

**నాగములు కృషీవలుల మిత్రులు :** "మూషకా శ్శలభా శ్శుకా:" అను రీతిలో ఎలుకల బాధ ఈతిబాధలలో ఒకటి. పండిన సస్యమును తిని పాడుచేయు ఎలుకలను భయపెట్టుటకై విదేశములలోని కర్షకులు క్షేత్రములలో నాగములను పెంచుదుము. కావున వీనికి వ్యవసాయదారుల మిత్రముగా(Farmer's Friend) గా ప్రసిద్ధి కలదు.

**పండుగలలో నాగముల ప్రాధాన్యము :** భారతదేశములో ఆచరింపబడు పలు

పండుగలలో కొన్నిటియందు నాగములకు ప్రాధాన్యము కలదు. వానిలో నాగ పంచమి, నాగచతుర్థి, సుబ్రహ్మణ్యషష్ఠియు పేర్కొనదగినవి. (ఇచటి సుబ్రహ్మణ్య పదము కుమారస్వామినికాక, నాగమును తెలుపును). శ్రావణ శుద్ధపంచమి నాగపంచమిగా, మార్గశిరశుద్ధ షష్ఠి సుబ్రహ్మణ్యషష్ఠిగా ప్రసిద్ధి. శ్రావణశుద్ధ చతుర్థికి, (కార్తీక మాసములోని శుద్ధ చతుర్థికి) నాగుల చవితి అని పేరు. వీనిలో సుబ్రహ్మణ్య షష్ఠి, నాగులచవితియు దక్షిణభారతదేశమున ప్రచురముగా ఆచరింపబడగా, నాగపంచమి సర్వత్ర ఆచరింపబడుచున్నది. నేపాల్ దేశములోఈ పంచమి శ్రావణ కృష్ణపక్షములోని పంచమినాడు చేయుట విశేషము. ఆ దినము గరుడునకు-నాగులకు మధ్య జరిగిన భీషణ యుద్ధమునకు స్మారకమని వారి నమ్మకము. నాగుల పండుగలలో ప్రధానమైన నాగపంచమి వర్షాకాల ప్రారంభములో ఆచరించుట సాభిప్రాయకము అని, ఆ ఋతువులో పుట్టలలో నుండి పాములు విరివిగా బయట సంచరించును కావున వానివలన తమకు బాధకల్గకుండుటకై భారతీయులచే ఈ పండుగ శ్రావణమాసములో చేయబడుచున్నదని ఆధునిక విమర్శకులు తలచు చున్నారు. ఈపండుగలలో పాముపుట్టలలో పాలుపోయుట,ప్రదక్షిణ నమస్కారాదులను చేయుటతోపాటు సంతానార్థులైన స్త్రీలు నాగశిలలను కూడ ప్రతిష్ఠింతురు. ఇట్టి ప్రతిష్ఠ రావిచెట్టు, వేపచెట్టు కలసి పెరిగినచోట చేయుట విశేషము.

పలుచోట్ల నాగములకు ప్రత్యేకాలయములు కలవు. గుజరాత్‌లోని Than అను చోట,కథియవార్‌వద్ద వాసుకి ఆలయము కలదు. ఇండోర్ ప్రాంతములోని నవళివద్ద తక్షకునకు, నేపాల్ రాజ్యమున కర్కోటకునకును, ఆలయములు కలవు. ఆదిశేషునకు మేల్‌కోట్టై, శిఱుపులియూర్ మొదలగు చోట్ల ప్రత్యేకాలయములు ఉన్నవి. కర్ణాటక రాష్ట్రములోని ఆనెక్కల్ అనుచోటగల నాగశిలలును ప్రసిద్ధములు. ఇట్లు ఆసేతుహిమాచలము పలుచోట్ల నాగముల ఆరాధన ఈనాటికిని చేయబడు చున్నది. ఆంధ్రదేశమున శ్రీకాళహస్తి క్షేత్రమున చేయబడు నాగప్రతిష్ఠ సుప్రసిద్ధము. ప్రాచీన కాలమునకు చెందిన శిల్పములలో, నాణెములలో కనిపించు సర్పాకృతులు నాగారాధన యొక్క ప్రాచీనతకు తిరుగులేని ఋజువులు. సాంచిలోని తూర్పు ద్వారము వద్ద-Bharut స్తూపములలో సర్పాకారములు కలవు. ఈ ఆకృతులలో కొన్ని ఒకే పడగను, కొన్నిమూడు,-అయిదు పడగలను కలిగియున్నవి.

**సంపదకు చిహ్నముగా నాగములు** : నాగము సంపదకు ప్రతీక. పూర్వము ధనవంతులు తమ ఇంటిముందు భాగమున వారు ఎన్ని కోట్ల ధనము ఆర్జించిరో,

ఆకోట్ల సంఖ్యకు తగిన సంఖ్యలో పాముపడగలను నిలిపెడివారట. కావుననే "కోటికి పడగలెత్తుట" అను జాతీయము ఏర్పడినది. ఇట్లు పలురీతులలో వైశిష్ట్యమునుకల నాగులలో ఆదిశేషుడు ముఖ్యుడు, మొదటివాడును. ఆ మహనీయుని వైభవము ఈ షణ్మాత్రముగా నివేదింపబడుచున్నది.

**ఆదిశేషుని వైభవము :** ఆదిశేషుడు నాగులలో మొదటివాడు. కావున ఆది అను విశేషణము సార్థకము. అంతయేకాక భగవచ్ఛేషభూతులైన జీవాత్మలలో ప్రథమగణ్యుడు. ఈ విధముగా కూడా ఆదిశబ్దము సార్థకము. శేషుడనుటకు భగవానునకు ఇష్టవినియోగార్హుడని, ప్రళయమున సైతము శేషించువాడని, భగవానుడు ఇతనిపై పరుండునని-ఇట్లు పలు సార్థకములైన వ్యుత్పత్తులను చెప్పవచ్చును. ఇతడు సర్వకాల, సర్వావస్థలయందు స్వామిని వెన్నంటియుండి, తదభిమతానుసారముగా కైంకర్యమును చేయును. పర వ్యూహాదులందు అంతట విడువక వెంటనేయుండును. పరమపద వ్యూహ విభవములలో శేషుడు భగవానుని విడువక యుండుట, ప్రస్తుత స్తోత్రవ్యాఖ్యలో వివరింపబడినది. అర్చారూపము విషయమున స్వామి శయనించియుండు తల్పము, సింహాసనము మొదలగునవియే కాక సేవలో ఉపయోగపడు ఛత్ర అంశుకాదులును శేషుని రూపములే. కావున ఆ స్థితిలోకూడ విశ్లేషము లేకయుండును. ఇక, అంతర్యామి విషయమునకు అనుగుణముగా "అరవిల్ తుయిలరమర్న్ద విత్తినై ఉళ్లత్తుక్కొణ్డు" (క్షీరాబ్ధిలో శయనించియుండు మూలకారణభూతుని మనసుననిలిపి ) అను తిరుప్పావైసూక్తి, దానిని వ్యాఖ్యానించుచు శ్రీకృష్ణసూరివరులు "అరవత్తమళియనోడుమ్ అళకియ పాళ్కడలోడుమ్, అరవిన్ద ప్పావైయుమ్ తానుమ్ అకమ్బడివన్దు పుగున్ద- ఎన్గిఅపడియే తిరుప్పాళ్కడలోడుమ్ తిరువనన్దాళ్వానోడుమ్, నాయ్చ్చిమారోడుమ్ కూడతజ్జళ్ నెఞ్జిలేకొణ్డు"-అని పల్కుటయు అనుసంధేయములు. ఆదిశేషుడు భగవానునకుచేయు పలు స్వరూపానురూప కైంకర్య విశేషములు యామునుల నివాస శయ్యాసన పాదుకాంశుకోపధాన వర్షాతపవారణాదిభిః" అను స్తోత్రరత్న సూక్తి రత్నమువలన స్పష్టమగుచున్నది. ఈ సూక్తి సరోయోగి యొక్క "శెన్డాల్కుడై యామ్" ఇత్యాది పాశురమునకు అనువాదము. ప్రస్తుత స్తోత్ర మీ సూక్తుల భావమును విశదీకరించు చున్నదనుట వ్యాఖ్యలో వివరింపబడినది.

"అనంతః ప్రథమం రూపం త్రేతాయాం లక్ష్మణ స్తథా, ద్వాపరే బలభద్రస్తు కలౌకశ్చిత్ భవిష్యతి" అను సుప్రసిద్ధ పౌరాణికసూక్తి ఆదిశేషుని ముఖ్యములైన

అవతారములను పేర్కొనుచున్నది. వీనిలో అనంత-లక్ష్మణ-బలరామావతారములు సుప్రసిద్ధము. "కలౌ కశ్చిత్" అనుట భగవద్రామానుజులను ఉద్దేశించి పల్కినమాట. ఈ అంశము ప్రస్తుత స్తోత్రములోని "వపుశ్చభ్దే"త్యాది శ్లోకములోని "దర్శయంతం పరంబ్రహ్మ" అనునపుడు వివరింపబడినది. ఈ నాల్గురూపములేకాక, ఆదిశేషుని పతంజలి రూపమును ప్రసిద్ధము. ఈ అవతారముతో అతడు చరకసంహిత ద్వారా ఆయుర్వేద శాస్త్రమును, వ్యాకరణమహాభాష్యముద్వారా వ్యాకరణశాస్త్రమును, యోగ సూత్రములద్వారా యోగశాస్త్రమును ప్రవర్తింపజేసి శరీర వాక్-మనస్సుల దోషములను పోగొట్టెను. ఆదిశేషుడు జ్యోతిశ్శాస్త్ర ప్రవర్తకుడుగాకూడ ప్రసిద్ధుడు. "ప్రకృష్ట విజ్ఞాన బలైక ధామని" అను స్తోత్రరత్న సూక్తిని వ్యాఖ్యానించుచు దేశికులు "పంచవిధజ్యోతిస్సిద్ధాన్తప్రవర్తకత్వేన జ్ఞానప్రకర్షోఽస్య ప్రసిద్ధః" అని పల్కుట ఇందులకు ప్రమాణము. తరిత్తిరున్దే నాకవే తారాకణప్పోర్ విరిత్తురైత్త వెన్నాకత్తున్నె" (63) అను నాన్ముకన్ తిరువన్దాదిసూక్తివలనకూడ ఆదిశేషుని జ్యోతిశ్శాస్త్ర ప్రవర్తకత్వము సూచింపబడినదని మహావిద్వాన్ కాంచీ శ్రీ.ప్ర.భ. అణ్ణాస్వామి వచించిరి. సుప్రసిద్ధమైన శ్రీకృష్ణాష్టోత్తర శతనామ స్తోత్రము అనంతుని ముఖమున లోకమున ప్రవర్తిల్లెను.

ఆదిశేషుని అవతారముల విషయమున వేరొక అంశమును ముఖ్యముగా ప్రస్తావింపతగినది. భగవద్రామానుజుల అంతరంగశిష్యులలో ఒకరు, ఆ రామానుజుల అజ్ఞ చొప్పున తిరుమలలో వేంకటేశ్వరునకు నిత్యము పుష్ప కైంకర్యమును చేసినవారును అగు అనంతాచార్యులు ఆదిశేషాంశ సంభూతులుగా చెప్పబడుచున్నారు. ఇందులకు గత శతాబ్దిలో సుప్రసిద్ధవిద్వాంసులు అగు పురిశై శ్రీరంగాచార్యులవారు అను మహనీయులచే రచింపబడిన "అనంతార్య కథా సంగ్రహః" అనబడు సంప్రదాయచారిత్రకగ్రంథములో ఉట్టంకింపబడిన ఈ క్రింది ఉదంతమును ఉదాహరణముగా పెద్దలు చెప్పుచున్నారు. ఒకనాడు అనంతార్యులు కొండపై ఉద్యానవనమున పూలుకోయుచుండగా నాగుపాము కాటువేసెను. వెంటనే అనంతార్యులు స్నానమొనర్చి; విషమునకు వైద్యమేమియు చేయించుకొనకనే పుష్పకైంకర్యమును యథాపూర్వము చేయసాగిరి. అపుడు భగవానుడు అర్చక రూపమున విషనివారణమునకు ఏల ప్రయత్నింపలేదని వారిని అడుగగా, "కఱచిన పాము ఎక్కువ బలముకల్గినదైన విరజానదిలో స్నానమాడి, పరమపదనాథుని సేవింతును. కఱువబడిన ఈపాము ఎక్కువ బలముకల్గినదైన స్వామిపుష్కరిణిలో

తీర్థమాడి, నిన్ను సేవింతును" అని అనంతార్యులు నర్మగర్భముగ బదులిచ్చిరి. ఇట్లు ఆ మహనీయులు తమను తామే "కఱువబడిన పాము" అనుచు పాముగా నిర్దేశించుకొనుట వారి ఆదిశేషాంశను సూచించుచున్నదని ఆచార్యుల అభిప్రాయము.

అనంతరకాలమున ప్రసిద్ధులైన శ్రీవైష్ణవాచార్యులలో ఒకరగు శ్రీవరవరమునులును ఆదిశేషుని అంశతో అవతరించిరని ప్రసిద్ధికలదు. అందులకు పలు నిదర్శనములున్నను ఒకటిమాత్ర మిచట తెలుపబడుచున్నది. ఒకనాడు ఆ ఆచార్యవరులు మధ్యాహ్న సమయమున ఏకాంతముగా విశ్రమించు సమయమున ఒక భక్తురాలు యాదృచ్ఛికముగా తలుపుల సందునుండి చూచెను. అపుడు ఆమెకు ఫణావిరాజమాన సర్పాకృతి కనుపింపగా ఆమె మిక్కిలి భీతిల్లెను. ఈ సంగతిని గమనించిన వరవరమునులు పిమ్మట ఆమెను రహస్యముగా పిలిచి తాము ఆదిశేషాంశ సంజాతులగుటను తెలిపి, ఆ రహస్యమును ఎవరివద్దను వెల్లడి చేయవలదని నియమించిరి. ఈ అంశము వారి చరిత్రను తెలుపు యతీంద్ర ప్రవణ ప్రభావమను గ్రంథములో కలదు.

ఆదిశేషుడు సంకర్షణస్వరూపుడు; గొప్ప జ్ఞానబలములను కలవాడు. "ప్రకృష్టవిజ్ఞానబలైకధామని" అని యామునులు పల్కిరికదా! జగత్తును అంతటిని భరించు భగవానునే మోయుట ఆదిశేషుని ప్రకృష్ట బలమునకు తార్కాణ. పలు శాస్త్రములను ప్రవర్తింపచేయుట ఆ మహనీయుని జ్ఞానవైభవమును చాటుచున్నది అని దేశికుల వివరణ. ఇతడు కాల స్వరూపుడని, సంహారకర్తఅని, దృశ్య-ద్రష్టల సంధానకర్త అని (సంకర్షణుడు కావున) పురాణములు పేర్కొనుచున్నవి. బ్రహ్మమాట పై మందరాద్రిని ఎత్తి క్షీరాబ్ధిలో నుంచినవాడితడే అని మహాభారతము తెలుపుచున్నది. ఆదిశేషుడు శయ్యాసనాది రూపములలో స్వామికి చేయు సేవలలోని పలు స్వారస్యములు, ధ్వన్యర్థములును ఆయా ఆచార్యులచే ఆయా దివ్యప్రబంధ వ్యాఖ్యలలో వివరముగా నిరూపించబడినవి. వానిని విస్తరభీతిచే ఇచట ప్రస్తుతించుటలేదు. కొన్నిమాత్రము ప్రకృతస్తోత్రవ్యాఖ్యలో యథావకాశము చూప బడినవి.

ఆదిశేషునకు - భగవానునకు మధ్యగల సంబంధభావన వేదకాలములో లేదని, తదనంతరకాలముననే ఉద్భావితమని ఆధునిక విమర్శకులు తలచుచున్నారు. కాని, శ్రీకృష్ణసూరి "నివాసశయ్యాసన" ఇత్యాది యామునుల స్తోత్రరత్నశ్లోకమునకు

వ్యాఖ్యలో ఆసనశబ్దమును వివరించుచు "పర్యంకవిద్యాదిషు ఆమ్నాతం దివ్య సింహాసనమ్" అని పల్కుటచే కౌషీతకీ బ్రాహ్మణములోని పర్యంకవిద్యలోగల "అమితౌజా: పర్యంక:" ఇత్యాది సూక్తి ఆదిశేషుని పరామర్శించు చున్నట్లుగా పూర్వాచార్యులు అభిప్రాయపడినట్లు తెలియుచున్నది. కావున వేదకాలమునలోనే వీరిరువురి సహయోగము భావింపబడినదనుట నిస్సందేహము. పిమ్మట ఆవిర్భవించిన వైఖానస పాంచరాత్రాది ఆగమములలో ఆదిశేషుని సింహాసనముగా, శయనముగా కల్గియుండుట విస్తృతముగా కాననగును. దేవాలయములలోని ధ్వజస్తంభము, శఠారి, ఆరాధనలో ఉపయోగించు కూర్చ మొదలగునవి అన్ని శేషాత్మకము అని ఆగమములలో కలదు. భగవానునిసేవకై వినియోగించు పరికరములన్నియు ఆదిశేషుని అంశాత్మకములుగానే భావింపబడుచున్నవి. చోళసింహపురమను క్షేత్రములో శఠారిపై ఆదిశేషుని రూపముండుటయు ఇచట స్మరణీయము.

విష్ణ్వాలయములలో బ్రహ్మోత్సవ ప్రారంభము ధ్వజారోహణముతో మొదలగును. ఆ సందర్భమున పలువురు దేవతలు స్వామి కైంకర్యార్థము ఆహ్వానింపబడుదురు. ఆదిశేషుని ఆహ్వానించునపుడు అనుసంధించు అనంతగద్యను ఆగమము ఇట్లు తెల్పినది -

**హే అనంత ! సహస్రభోగిసమావృతాఖిలపూజిత !**
**క్షీరవర్ణ ! రసాతలాధిపసేవ్యమానపదాంబుజ ।**
**విష్ణుతల్ప ! విశేషభాసురరత్నశోభితమస్తక !**
**శ్రీధవోత్సవసేవనార్థమిహైహి భోః కృపయాధునా ॥**

ఆదిశేషునకు వారుణి, కీర్తి అని ఇరువురు భార్యలు కలరని పాంచరాత్రాగమమున కలదు. ఇతడు నీలవస్త్రధారి, లాంగ - ముసలములను ఆయుధముగా కలవాడు. ఒకే కుండలమును ధరించును. ఇతని వర్ణము తెలుపు మణి విరాజితములైన సహస్రఫణములను గలవాడు. "ఓమ్ హామ్ అనన్తాయ నమః" అనునది అనంతుని మూలమంత్రము.

**ఉపసంహారము :** "సో అంగ వేద యది వా న వేద" అని సంస్కృత వేదము "తనక్కుమ్ తన్ తన్మై యతివరియానై" అని ద్రావిడ వేదమును సర్వజ్ఞుడైన భగవానుడును తన మహిమను తానుకూడ తెలియలేదన్నవి. అది ఈ ఆదిశేషుని యందును అన్వయించును. అతడు భగవదంశభూతుడేకదా ! ఇక, అట్టి ఆదిశేషుని

అప్రమేయమైన అతిశయమును కీర్తించుట నావంటివానికి అసాధ్యమనుట కింపునర్న్యాయ సిద్ధము. అయినను ఆ మహనీయుని వైభవమును యథాశక్తి కీర్తించి, ఆత్మలాభమును పొందవలెనను భావనతో ఈ వ్యాఖ్యాన యత్నమును చేసితిని. నాకు పలురీతుల ప్రోత్సాహమిచ్చి, మార్గదర్శనము కావించిన పితృపాదులు న్యాయవేదాంతవిద్వాన్, ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామి వారిసన్నిధిలో సప్రశ్రయముగా నమ:పూర్వక కృతజ్ఞతాంజలులను సమర్పించుకొనుచున్నాను. నన్నీ వ్యాఖ్యారచనకు పురికొల్పిన మిత్రమహోదయులు, పలు సద్గ్రంథముల ప్రచురణలో ప్రత్యక్ష-పరోక్ష సహాయములను చేయుచు, సాహిత్య సేవను చేయుచున్న వారును అగు శ్రీయుతులు ఆర్. మోహనరావు గారికి కృతజ్ఞతాపూర్వక నమస్సులు. "దర్శయంతం పరం బ్రహ్మ" అనుచోట వ్యాఖ్యలో అవసరమైన సూచననుచేసి, వ్యాఖ్యను పూర్తిగా కటాక్షించిన ఉభయవేదాన్త వాచస్పతి,వాచస్పతి, ఉభయవేదాన్త సభాధ్యక్షులు ఉ.వే. శ్రీమాన్ కె.ఎస్. రామానుజాచార్యస్వామి(నెల్లూరు)వారి సన్నిధిలో కృతజ్ఞతాంజలులు. ఈవ్యాఖ్యను డి.టి.పి. చేసిఇచ్చుట ద్వారా ప్రోత్సాహమందించిన బాల్యమిత్రము, ఉభయవేదాంతసభాకార్యదర్శి, ఉ.వే.శ్రీమాన్ **N.V.L.N.** **రామానుజాచార్య స్వామి** వారి సన్నిధిలో హార్దికములైన కృతజ్ఞతలు. నీర క్షీర న్యాయమున విజ్ఞులు ఈ వ్యాఖ్యను ఆదరింతురని నమ్ముదును.

**స్తుతేః శ్రీమదనంతస్య వ్యాఖ్యేయం కృపయా గురోః।**
**శ్రీసేవా శింగరార్యేణ కృతాస్యా ద్బుధహర్షిణీ॥**

ఇట్లు

సహృదయనియోజ్యుడు

***ఈ.ఏ. శింగరాచార్యులు.***



ఆదిశేషుడు

శ్రీమద్విష్ణుపదాంభోజపీఠాయితఫణాతలమ్।
శేషత్వైకస్వరూపం తమాదిశేష ముపాస్మహే॥




# నాగబంధశ్లోకము

శ్లో॥ వందేఽనన్తం ముదా భాన్తం రుచా శ్వేతం సురార్చితమ్।
హరిపాదాబ్జ శరణం తదీయాస్యాబ్జ తోషణమ్॥

శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీమదనన్తస్తవః

## (ఆదిశేషస్తవః)

**శ్రీమద్విష్ణుపదాంభోజపీఠాయితఫణాతలమ్।**
**శేషతైకస్వరూపం త మాదిశేష ముపాస్మహే॥** 1

**అర్థము:**-శ్రీమద్విష్ణు=శ్రీమన్నారాయణుని; పద+అంభోజ=పద్మములవంటి పాదములకు; పీఠాయిత=ఆసనపీఠముగానైన;ఫణాతలమ్=పడగల పైభాగమును కలవాడు;శేషతా+ఏకస్వరూపమ్=శేషత్వమే స్వరూపముగాకలిగినవాడు;తమ్=అనిర్వచనీయ వైభవమును కలిగిన ఆ; ఆదిశేషమ్=ఆదిశేషుడనుపేరుగల అనంతుని; ఉపాస్మహే=ఉపాసింతుము.

**తాత్పర్యము** :- శ్రీమన్నారాయణుని పాదపద్మములకు ఆసనపీఠమై అమరిన పడగల పైభాగమును కలవాడు,శేషత్వమే స్వరూపము:గా కలవాడునగు ఆదిశేషుని ఉపాసించుచున్నాము.

**వ్యాఖ్యానము** :- అనన్తస్తవమను పేరుగల ఈ లఘుస్తోత్రము భగవానునకు నిత్యము సకల కైంకర్యములనుచేయు ఆదిశేషుని మహిమను సమగ్రముగా ప్రతిపాదించు చున్నది. ఆపరమ భక్తుడు స్వామికిచేయు పలుసేవలను, ఆతని భాగవత పారమ్యము ను, ఆతనికి కల పలునామముల సార్థక్యమును తెలుపుట ఈస్తుతియొక్క ముఖ్య ప్రమేయము.

శ్రీమద్విష్ణు-ఫణాతలమ్- ఇచట శ్రీమత్ అను విశేషణమును విష్ణుశబ్దమునకే కాక పదాంభోజమునకు అట్లే ఫణాతలమునకును అన్వయింప వచ్చును. పదాంభోజ శబ్దమునకు అన్వయించినపుడు ఆ పదమునకు శ్రీఅనుటకు శోభఅని, ఫణాతలము నకు అన్వయించినపుడు కైంకర్యలక్ష్మి అనియు అర్థమును చెప్ప వచ్చును.

పదములను పద్మములతోపోల్చుటచే పదముల సౌకుమార్యము, సౌందర్యము, సౌగంధ్యము,ఆరుణ్యము,భోగ్యత మొదలగు అంశములు, ఫణాతలమును పీఠముతో పోల్చుటచే వైశాల్యమును స్ఫురించుచున్నవి. కావున ఇచట ఉపమాలంకారము కలదు. స్తవప్రారంభమును శ్రీశబ్దముతో చేయుటచే మంగళాచరణమును చేసినట్లయినది. **మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని చ** అనికదా మహాభాష్య సూక్తి. మఱియు ఉపాస్మహే అను క్రియాప్రయోగమువలన **ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశోవాపి** అని విధింప బడిన నమస్కృతిరూపమైన కావ్యారంభము చేయబడినది.

**శేషతైకస్వరూపమ్**- శేషత్వమును ఒక్కటినే స్వరూపముగాగలవాడు. ఇచట స్వరూపశబ్దము స్వభావవాచి. స్వరూపశ్చ స్వభావశ్చ నిసర్గశ్చ అని అమరకోశము. వేదములు, శాస్త్రములును ఆత్మస్వరూపమును ఆవిష్కరించునపుడు జీవాత్మను **విజ్ఞాతారమ్** అని, **విజ్ఞానాత్మా పురుషః** అని ఇత్యాదిగా జ్ఞానమును కల్గినవానినిగా (జ్ఞాతగా) చెప్పినవి. కాని, "అడియేనుళ్లాన్" అను రీతిలో శేషత్వమే ఆత్మయొక్క అంతరంగ నిరూపకముగా దివ్యసూరులు నిర్ధారించిరి. ఆ అభిప్రాయమును పూర్వాచార్యులును సమర్థించిరి. అట్లు జీవాత్మకు నిరూపకముగా చెప్పబడిన శేషత్వము మూర్తీభవించినవాడు ఆదిశేషుడు. శేషత్వమనగా స్వామికి అతిశయమును కలిగించుటకు తగినదియైన,తద్ద్వారా ఉపాదేయమైన స్థితి. శ్రీపిళ్ళై లోకాచార్యుల వారు తత్త్వత్రయమను రహస్యగ్రంథములో "శేషమగుట అనగా- చందన కుసుమ తాంబూలాదులవలె స్వామికి ఇష్టవినియోగార్హమై యుండుట"అని నిర్వచించిరి. భగవద్రామానుజులు వేదార్థసంగ్రహములో **పరగతాతిశయాధానేచ్ఛయా ఉపాదేయత్వమేవ యస్య స్వరూపమ్ - సః శేషః,పరః శేషీ** అని శేషత్వమును నిరూపించిరి. "యథేష్టవినియోగార్హం శేషశబ్దేన కథ్యతే" ఇత్యాది పలుప్రమాణములు ఇచట స్మరణీయములు. కావున స్వప్రయోజన గంధమే మాత్రమును లేకుండ, పరిపూర్ణముగా స్వామికి ఉపయోగపడు అర్హతను కలిగి యుండుట శేషత్వము. ఇట్టి స్వభావము మూర్తీభవించినవాడు ఆదిశేషుడు. ఈ అంశము ముమ్ముందు శ్లోకములలో తేటతెల్ల మగును.

**తమ్ ఆదిశేషమ్**- ఇచటి "తమ్"అను సర్వనామశబ్దము ఆదిశేషుని అనిర్వచనీయ

మహిమాతిశయమును తెలుపును. **ఆదిశ్చాసౌ శేషశ్చ; శేషాణామాదిః** అను విగ్రహమువలన భగవానునకు శేషభూతులైన జీవాత్మలలో ప్రథమగణ్యుడు అను అర్థమును ఆదిశేషనామము సూచించుచున్నది.“**ఆదీయతే ప్రారంభసమయే ఏవ వ్యవహ్రియతే**” అను ఆదిశబ్ద వ్యుత్పత్తిని ఇచట గ్రహింపనగును.

సరోయోగి తమ ప్రబంధములో-**శెన్ఱాల్ కుడైయామ్,ఇరున్దాల్ శింగాసన మామ్,నిన్ఱాల్ మరవడియామ్,నీళ్ కడలుళ్ ఎన్ఱుమ్ పుణైయామ్, మణి విళక్కామ్,పూమ్పట్టామ్,పుల్కుమ్ అణైయామ్ తిరుమాఱ్కరవు** (53)(శ్రియఃపతి నడచినపుడు గొడుగై,కూర్చున్నచో సింహాసనమై, నిలచినచో పాదుకలై, పాల సముద్రమున ఎల్లప్పుడు తలగడయై, మంగళదీపమై, పీతాంబరమై, శయనించు శయ్యయై ఆదిశేషుడు అమరును) అనుచు ఆదిశేషుడు స్వామికి చేయు పలుసేవలను స్తుతింపగా,ఈ అర్థమును శ్రీయామునులు-**నివాస శయ్యాసన పాదుకాంశుకోపధాన వర్షాతపవారణాదిభిః, శరీరభేదై స్తవ శేషతాంగతైః యథోచితం శేష ఇతీరితే** అను శ్లోకమున అనుసంధించిరి. ఈసూక్తిలోని ఆదిపదమును వ్యాఖ్యానించు శ్రీదేశికులు “**ఆదిపదేన పాదపీఠాది సంగ్రహః**” అని పల్కిరి.ఇట్లు భగవానుని పాదపీఠముగా అమరిన ఆదిశేషుని కైంకర్యవిశేష మిందు ప్రస్తుతము.మఱియు నిత్యము భగవదారాధన ప్రారంభములో భక్తులు పఠించు“**కూర్మాదీన్ దివ్యలోకమ్**”అను శ్లోకములో “**ఉరగమ్ పాదుకే**” అని యుండుటయు స్మరణీయము.

**అనంతాం దధతం శీర్షై రనంతశయనాయితమ్।**
**అనంతే చ పదే భాంతం త మనంత ముపాస్మహే॥** 2

**అర్థము** :- శీర్షైః అనంతాం దధతమ్=పడగలతో(తలలతో)భూమిని ధరించువాడు, అనంత శయనాయితమ్=అనంతశబ్దవాచ్యుడగు భగవానునకు శయ్యయైనవాడు, అనంతేపదే=అనంతమైన పదమగు పరమపదమున, భాంతమ్ చ =ప్రకాశించు వాడునుఅగు,అనంతమ్=అనంతుడనబడు ఆదిశేషుని, ఉపాస్మహే=ఉపాసింతుము.

**తాత్పర్యము** :-తన తలలతో భూభారమును వహించువాడు,భగవానునకు శయ్యగా అయిన వాడు, పరమపదమున వెలుగొందువాడును అగు అనంతుడనబడు ఆదిశేషుని ఉపాసింతుము.

వ్యాఖ్యానము :-ఈ శ్లోకమున అనంతశబ్దము పలుఅర్థములలో ప్రయోగింపబడుట గమనింపదగినది.

**శీర్షైః అనంతాం దధతమ్**-ఇచటి అనంతశబ్దము భూమివాచకము. "**భూర్భూమి రచలానంతా**" అని అమరము. ఆదిశేషుడు భూభారమును మోయుటకు సంబంధించిన వృత్తాంతము మహాభారతమున ఆదిపర్వప్రారంభములో 36వ అధ్యాయమున కలదు. తన తల్లి కద్రువ, సోదరులును గరుడునిపట్ల ప్రవర్తించు తీరునుచూచి కలతచెందిన ఆదిశేషుడు వారిని వీడి ప్రాణత్యాగమును చేయనెంచి, గంధమాదనపర్వతమున, గోకర్ణక్షేత్రమున, బదరియందు, హిమవత్పర్వతములో తీవ్రమైన తపస్సును చేయసాగెను.అపుడు బ్రహ్మ అతనిని ఊఅడించి, లోక కల్యాణార్థము భూమిని అతని పడగలపై మోయుమని,అతనికి గరుడుడు సహాయుడు కాగలడనియు పల్కెను. ఈ విధముగా ఆదిశేషుడు భూభారమును మోయువా డయ్యెను.ఈ అంశము పూర్వోక్త సందర్భములోని "**ఇమాం మహీం శైలవనోపపన్నాం ససాగరగ్రామవిహారపత్తనామ్,త్వం శేష! సమ్యక్ చలితాం యథావత్ సంగృహ్యా తిష్ఠస్వ యథాచలా స్యాత్**", "**సుపర్ణంచ సహాయం వై భగవానమరోత్తమః ప్రాదదా దనంతాయ తదా వైనతేయం పితామహః**" ఇత్యాదిశ్లోకములు స్పష్టము చేయుచున్నవి. ఇట్లు ఆదిశేషుడు భూభారమునుమోయుట ఆ మహనీయుని ప్రకృష్టబలమునకు చిహ్నము. స్తోత్రరత్నములోని "ప్రకృష్టవిజ్ఞానబలైకధామని"అను ప్రయోగమును దేశికులు వ్యాఖ్యానించుచు "**తేనేయం నాగవర్యేణ శిరసా విధృతా మహీ,బిభర్తి మాలా లోకానామ్ సదేవాసురమానుషామ్**" ఇత్యాదిభిశ్చ, అను విష్ణు పురాణ సూక్తిని (2-5) ఉట్టంకించుటద్వారా ఈ అంశమును సూచించిరి. ఇచట ప్రస్తావింపబడిన ఆదిశేషుని జన్మవృత్తాంతము కర్మమూలముగా కాక, భగవదవతార సదృశముగా భావింపనగును.

**అనంతశయనాయితమ్**-ఇచటి అనంతశబ్దము భగవద్వాచకము. దేశకాలవస్తు పరిచ్ఛేద త్రయము లేనివాడగుటచే భగవానుడు అనంతుడనబడుచున్నాడు. "**నాస్య దేశకాల వస్తుతోఽవధయః సంతి ఇతి అనంతః**" అను శ్రీపరాశరభట్టర్ విష్ణు సహస్రనామభాష్యములోచేసిన వివరణము ఇచట స్మరణీయము. అనంతములైన కల్యాణగుణములను కలిగినవాడు కావునను అనంతుడనబడు చున్నాడనియు

చెప్పనగును."మతిక్షయా న్నివర్తంతే న తు గోవిందగుణక్షయాత్" "ఈరిల వణ్ పుకళ్"ఇత్యాది సూక్తుల నిచట స్మరింపనగును.ఇట్లు అనంతశబ్ద వాచ్యుడగు భగవానునకు శయ్యగా ఆదిశేషుడుమారి సేవించుచున్నాడు. అనంత శయనత్వము భగవానుని పరత్వచిహ్నములోనొకటి. భగవానుడు పాలకడలిలో శయనించుటకు వీలుగా ఆదిశేషుడు శయ్యయైనవృత్తాంతము ఒకటి కాళికా పురాణములో 27వ అధ్యాయమున నున్నట్లు శబ్దకల్పద్రుమములో పేర్కొనబడినది. అచట ఉట్టంకింప బడిన శ్లోకములు ఇట్లున్నవి.

"అనంతః తత్ర గత్వా తు యత్ర క్షీరోదసాగరః,
తత్ర స్వయం శ్రియా యుక్తం సుషుప్సంతం జనార్దనమ్।
తస్యోపధాన మకరో దనంతో దక్షిణాం ఫణామ్,
ఉత్తరాం పాదయోః చక్రే ఉపధానం మహాబలః॥

తాలవృంతం తదా చక్రే స శేషః పశ్చిమాం ఫణామ్,
స్వయం తు వీజయామాస శేషరూపో జనార్దనమ్.
ఐశాన్యాం ఫణయాచాథ స దధౌ గరుడం తథా,
గదాం పద్మంచ శార్జ్గంచ తథైవ వివిధాయుధమ్,
ఏవం కృత్వా స్వయం కాయం శయనీయం తదా హరేః"

–ఈ శ్లోకములనుబట్టి ఆదిశేషుడు పాలకడలిలోనున్న భగవానునకు శయ్యగా అగుటయే గాక, తన పడగలను శిరోపధాన పాదోపధానములుగా, వింజామరగా చేసి ఆ భగవానుని పరివారమును సమస్తమును ధరించెనని తెలియుచున్నది. ఇట్లు సపరివారుడైన స్వామిని ఆదిశేషుడు మోయుట పూర్వమువలె ప్రకృష్టబలమునకు సూచకము. "సర్వాధారభూత భగవద్విగ్రహధారణేన బల ప్రకర్షోఽస్య వ్యక్తః"అను దేశికకృత స్తోత్రరత్నభాష్య శ్రీసూక్తి అనుసంధేయము. దివ్యసూరుల సూక్తులను అధారముగాగొని పూర్వాచార్యులు ఆదిశేషుడు స్వామికి శయ్యగామారుటలోని స్వారస్యములు విస్తరభీతిచే ప్రస్తావించుటలేదు.

అనంతే చ పదే భాంతమ్---అనంతమైన పదమనగా పరమపదము.అనగా వైకుంఠము. భగవద్రామానుజులు గద్యత్రయమున "తేషామపి ఇయత్పరిమాణమ్, ఇయదైశ్వర్యమ్, ఈదృశ స్వభావమితి పరిచ్ఛేత్తు మయోగ్యే"అనుచు పరమపదమును

గూర్చి అంతులేని పరిమాణమును, ఐశ్వర్యమును, స్వభావమును కల్గినదిగా పల్కిన సూక్తిని స్మరింపనగును. మఱియు అనంతశబ్దము నభోఽన్తరిక్షం గగన మనంతమ్ అను నిఘంటు వచనమును బట్టి ఆకాశమును తెలుపును. ఇచటి అనంతశబ్దము పరమాకాశమగు పరమపదమును బోధించును. అట్టి పరమపదమున వెలుగొందు వాడు అని భావము.

**తమ్ అనంతమ్ ఉపాస్మహే**---అట్టి అనంతుని ఉపాసింతుము. ఆదిశేషుడును అనంత శబ్దముచే బోధింపబడుచున్నాడనుట **నాంతం గుణానాం గచ్ఛంతి తేనానంతోఽయ మవ్యయః** అను విష్ణుపురాణ (2-5) సూక్తివలన స్పష్టపడు చున్నది. అంతులేని గుణములను కలవాడు కావున ఆదిశేషునకు అనంతుడను నామము సార్థకమని పై సూక్తి తాత్పర్యము. ఇట్లు గుణములలో ఆనంత్యమునేకాక, స్వరూపమునందును ఆనంత్యమును కలవాడు ఈ మహనీయుడు. కులశేఖరుల ప్రబంధములోని **అనంద నెన్నుమ్ అణివిళఙ్గుముయిర్వెళ్ళై యణైయమేవి** (1-1) అను ప్రయోగములోని అనంతశబ్దమును శ్రీకృష్ణసూరి "అంతటను వ్యాపించియున్న సర్వేశ్వరుని పూర్తిగా గ్రహించునట్టి స్వరూపగుణములను కలవాడగుటచే అనంతుడని చెప్పబడుచున్నాడు" అని వివరించుట ఇందులకొక ఉదాహరణము. అట్లే భగవత్సేవను అనంతముగా చేయువాడు కావునను అనంతుడనియు చెప్పవచ్చును. ఈ భావము ప్రస్తుత స్తోత్రములోని **"అనంత శ్చాస్మి"** అను శ్లోకమున అనుసంధింపబడినది. ఇంతియేకాక ప్రళయ కాలమునందును ఆదిశేషునకు అంతములేదు కావున అనంతుడనియు చెప్పనగును. ప్రళయము ముగిసిన పిదపజలార్ణవములో స్వామి పరుండు మఱ్ఱిఆకు ఆదిశేషుడే అని పురాణవచనము. ఈ అంశము **"అత్త్వా లోకాన్"**అను వేరొక (9వ) శ్లోకమున ప్రస్తావింప బడినది. ఇట్టి అనంతుని ఉపాసింతునని తాత్పర్యము.

ఇట్లు అనంతశబ్దము వరుసగా భూమిని, విష్ణువును, పరమ పదమును, ఆదిశేషుని తెల్పునట్లు నాల్గుపాదములలో ఈశ్లోకమున ప్రయోగింప బడినది. ఇందులకు అనుగుణముగా **అనంతః శేషవిష్ణ్వోః స్యాత్, అనంతం సుర వర్త్మని, అనంతా శారిబా దూర్వా విశల్యాలాంగలీషుచ, అనంతా హైమవత్యాంచ గుడూచ్యాం చావనావపి** అను విశ్వనిఘంటువచనమును స్మరింపనగును.

ఆదిశేషుడు అనంతరూపములనుదాల్చి స్వామిని సేవించుననుటకు-స ఏకధా భవతి ద్విధా భవతి- సహస్రధా భవతి అను శ్రుతివాక్యము ప్రమాణము. శ్లోకమున మొదటి పాదమున ఆదిశేషుని విభవరూపము, రెండవపాదమున వ్యూహరూపము, మూడవపాదమున పరరూపము ప్రస్తుతింపబడినవని చెప్పనగును. ఈ మూడును మిగిలిన అంతర్యామి-అర్చారూపములకు ఉపలక్షణమనియు భావింపవచ్చును.

శేషీ శ్రియఃపతి స్తస్య శేషభూతం చరాచరమ్ ।
ప్రథమోదాహృతిం తత్ర శ్రీమంతం శేష మాశ్రయే॥ 3

అర్థము :- శ్రియఃపతిః=లక్ష్మీపతి,శేషీ=సర్వశేషి,తస్య=ఆ శ్రియఃపతికి,చర+అచరమ్ =చేతనాచేతనములు, శేషభూతమ్=శేష(భూత)ములు, తత్ర=వానిలో, ప్రథమ+ ఉదాహృతిమ్=మొదటి ఉదాహరణమైన, శ్రీమంతమ్=కైంకర్య లక్ష్మిని కలవాడైన, శేషమ్=ఆదిశేషుని, ఆశ్రయే=ఆశ్రయించుచున్నాను.

తాత్పర్యము :-శ్రియఃపతి ఒక్కడే శేషి. మిగిలిన చరాచరములన్నియు ఆ స్వామికి శేషములు. అట్టి శేషభూతులకు మొట్టమొదటి ఉదాహరణము, భగవానునకు నిత్యము పలురీతులలో సేవచేయుట అను కైంకర్యలక్ష్మిని కలవాడును అగు శేషుని ఆశ్రయించుచున్నాను.

వ్యాఖ్యానము :- శ్రీమన్నారాయణుడే పరమాత్మ అనుట నారాయణ పరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరమ్ ఇత్యాది శ్రుతివాక్యములు, ఒణ్ తామరైయాళ్ కేళ్వన్ ఒరువనైయే నోక్కుమ్ఉణర్వు ఇత్యాది దివ్యసూరిసూక్తులును ఇందులకు ప్రమాణములు. ఇట్టి శ్రియఃపతికి చరాచరములు శేషభూతములనుటను యస్యాస్మి న త మంతరేమి (యజు-5) అను మొదలగు వేదవాక్యములు, స్వత్వమాత్మని సంజాతం స్వామిత్వం బ్రహ్మణి స్థితమ్, దాసభూతాః స్వత స్సర్వే హ్యాత్మానః పరమాత్మనః ఇత్యాది స్మృతివాక్యములు, పరవానస్మి కాకుత్స్థ అను ఇతిహాస సూక్తులు మొదలగు పరశ్శత ప్రమాణములు తెలుపుచున్నవి. అట్టివారిలో శేషుడు ప్రథమోదాహరణము అనుటచే ఈ శ్లోకము ఆది శ్చాసౌ శేష శ్చ; శేషాణాం ఆదిః ఆదిశేషః అనురీతిలో ఆదిశేషశబ్దమును వివరించుచున్న దగును. శ్లోకములోని శ్రీమచ్ఛబ్దము కైంకర్య లక్ష్మిని కలిగియుండుటను తెలుపును. లక్ష్మణో లక్ష్మిసంపన్నః అని కదా! వాల్మీకి వచనము.

వందే సహస్రస్థూణాఖ్య శ్రీమహామణిమండపమ్।
ఫణాసహస్రరత్నౌఘైః దీపయంతం ఫణీశ్వరమ్॥ 4

**అర్థము** :-సహస్రస్థూణాఖ్య=(వేయి స్తంభములను కల్గినదగుటచే) సహస్ర స్థూణమను పేరుగల, శ్రీమహామణిమండపమ్=అందమైన గొప్పమణి మండపము ను, ఫణా సహస్ర రత్న+ఓఘైః=వేయి పడగలలోని రత్నముల సమూహముతో, దీపయంతమ్=ప్రకాశింప చేయుచున్న, ఫణి+ఈశ్వరమ్=నాగులకు ప్రభువగు అదిశేషుని, వందే=నమస్కరించు చున్నాను.

**తాత్పర్యము** :-శ్రీవైకుంఠనగరమున భగవానుదధివసించియుండు మండపము వేయి స్తంభములు కలిగినదగుటచే సహస్రస్థూణమని పేరు. తేజోమయమైన ఆ మండపమును సైతము ఆదిశేషుడు తన వేయిపడగలలో ప్రకాశించు రత్న సముదాయముతో మఱింతగ ప్రకాశింపచేయుచున్నాడు. అట్టి నాగరాజునకు అభివాదనమును చేయుచున్నాను.

**వ్యాఖ్యానము** :- జైమినీయబ్రాహ్మణములోని తలవకారశ్రుతి "సహస్రస్థూణే వినిర్మితే దృఢ ఉగ్రే యత్ర దేవానా మధిదేవ ఆస్తే" (4-384) అనుచు వైకుంఠములోని సహస్రస్థూణాఖ్య మండపమునుగూర్చి పేర్కొన్నది. భగవద్రామానుజులు వైకుంఠ గద్యలో కస్మింశ్చిత్ విచిత్రదివ్యరత్నమయ దివ్యాస్థానమండపే, దివ్యరత్నస్తంభ శతసహస్రకోటిభిః ఉపశోభితే అని పల్కుట, దీనిని అనుసరించుచు శ్రీలోకాచార్యుల వారు అర్చిరాది అను రహస్య గ్రంథమున 'అనేకవేల స్తంభములచే అలంకృతమై, ఉభయవిభూతుల లోని వారందఱు ఒకమూలలో ఒదుగునంతటి వైశాల్యమును కలిగినదై' అని నుడువుటను గమనింపగా, పై శ్రుతిలోని సహస్రశబ్దమునకు కేవలము వేయి అని మాత్రమే అర్థము కాదని, అది బహుత్వవాచకమని చెప్పనగును.

అదిశేషుని శిరస్సులలో వెల్గురత్నములు అంతులేని కాంతిని ప్రసరించు చుండును. "ప్రకాశించు గొప్పరత్నములు అమరియున్న పడగలకాంతికి తోడు"(66) అనుచు శ్రీమహాయోగి తమప్రబంధమున పేర్కొనిరికదా! "అత్యర్కానలదీప్తం తత్స్థానం విష్ణోఃమహాత్మనః" అనునట్లు సూర్యునికాంతికంటె, అగ్నితేజస్సుకంటె మించిన దీప్తినికల పరమపదములోగల శ్రీమహామణిమండపమును సైతము

ఆదిశేషునిపడగల లోని రత్నములు ప్రకాశింప చేయుచున్నవనుటచే ఆ రత్నముల ప్రకాశాతిశయము వ్యక్తమగుచున్నది.

ఆదిశేషుడు వేయిపడగలను కలవాడనుట, అందు రత్నములు ప్రకాశించుచుండు ననుటయు పురాణ,దివ్యసూరిసూక్తి సిద్ధము. విష్ణుపురాణములోని " స సహస్రశిరాః వ్యక్త స్వస్తికామలభూషణః, ఫణామణిసహస్రేణ యస్య విద్యోతయన్ దిశః" అను వచనము, కులశేఖర ప్రబంధములోని ఇనత్తుత్తి యణిపణ మాయిరజ్గళ్ అను సూక్తియు ఇందులకు తార్కాణములు. ఆదిశేషుడు వేయి ముఖములను కల్గియుండుటలోని స్వారస్యము వేయినోళ్ళతో స్వామిని కీర్తించుట కొఱకే. ఆదిశేషుడు ఫణీశ్వరుడనుటయు మిక్కిలి అర్థవంతము. కద్రువసంతానమగు నాగులలో ఆదిశేషుడే మొదటివాడు. అతడు తన తల్లి కద్రువను, నాగులను విడచివెళ్ళినపిదప నాగులు వాసుకిని తమ ప్రభువుగా చేసుకొనిరని మహాభారతమున కలదు. అమరకోశముననను "కాద్రవేయాః తదీశ్వరః శేషః" అని కలదు. 'వది-అభివాదన స్తుత్యోః' అను ధాతువునుండి నిష్పన్నమైన 'వందే' అను క్రియ నమస్కరించుట, స్తుతించుట అను కాయిక వాచికకైంకర్యములను సూచించుటచే, ఈ రెండింటివలన మూడవది అయిన మానసికస్మరణరూపమైన సేవయు ఉపలక్షిత మనదగును. ప్రస్తుత శ్లోకము శ్రీయామునుల స్తోత్రరత్నములోని "ఫణామణివ్రాత మయూఖ మండల ప్రకాశమానోదరదివ్యధామని" అను సూక్తిలోని భావమును అనుకరించు చున్నదనుట స్పష్టము.

శేషః సింహాసనీభూయ ఛత్రయిత్వా ఫణావళిమ్।
వీరాసనేనోపవిష్టే శ్రీశేఽస్మిన్నధికం బభౌ॥ 5

అర్థము:-శేషః=ఆదిశేషుడు,సింహాసనీభూయ=సింహాసనమై,ఫణావళిమ్=పడగల సమూహమును,ఛత్రయిత్వా=గొడుగుగాచేసి,అస్మిన్=ఈ, శ్రీశే=శ్రీమన్నారాయణుడు, వీరాసనేన=వీరాసనముతో,ఉపవిష్టే=కూర్చున్నవాడు కాగా, అధికమ్=మిక్కిలి, బభౌ =ప్రకాశించెను.

తాత్పర్యము :-పరమపదమున భగవానుడగు శ్రియఃపతి వీరాసనమున కూర్చుండి యుండును. అపుడు ఆదిశేషుడు స్వామికి సింహాసనముగా మారుటయేకాక,తన విశాలములైన పడగలను రాజచిహ్నమైన శ్వేతచ్ఛత్రముగాచేసి, మిక్కిలి ప్రకాశించెను.

"వైకుంఠేతు పరే లోకే శ్రియా సార్థం జగత్పతిః, ఆస్తే విష్ణు రచింత్యాత్మా భక్తైః భాగవతైః సహ" అనునట్లు వైకుంఠనగరమున భగవానుడు శ్రీసహితుడై, నిత్యముక్తులతో కలసి పేరోలగమును నిర్వహించును. ప్రభువు కొలువు తీరునపుడు సింహాసనమున కూర్చుండుట, అపుడు అతని శిరస్సుపై అధికారచిహ్నమగు శ్వేతచ్ఛత్రముండుటయు సహజము. అట్లే సర్వలోకములకు ప్రభువగు స్వామి కొలువు తీరునపుడు ఆదిశేషుడు సింహాసనముగా, శ్వేతచ్ఛత్రముగా మారునని తాత్పర్యము.

వ్యాఖ్యానము :--శ్రీవైకుంఠ దివ్యనగరిలో భగవానుడు ఆదిశేషునిపై వీరాసనమున కూర్చుండి యుండుననుటను-సవ్యం పాదం ప్రసార్య శ్రితదురితహరం దక్షిణం కుంచయిత్వా, జానున్యా దాయ సవ్యేతర మితరభుజం నాగభోగే నిధాయ ఇత్యాది భగవదారాధనా ప్రారంభశ్లోకము తెలుపుచున్నది. భగవానుడు పరమపదమున కూర్చున్న సన్నివేశమున, పాలకడలిలో శయనించిన సన్నివేశమున నుండుననుట సుప్రసిద్ధము. నిత్యగ్రంథమునందు భగవద్రామానుజులును "నాగభోగే సమాసీనమ్" అని "కుంచిత దక్షిణపాదం, ప్రసారిత వామపాదం, జానువిన్యస్త ప్రసారిత దక్షిణ భుజం, నాగభోగవిన్యస్త వామభుజమ్" అని పల్కిరి. ఇట్లు కుడికాలు మడచి, ఎడమ పాదము చాచియుంచి కూర్చున్న స్థితికి వీరాసనమని పేరు. కౌషీతకీ బ్రాహ్మణములోని పర్యంక విద్యలో "అమితౌజాః పర్యంకః" అనివర్ణింపబడిన భగవానుని దివ్యసింహాసనము ఆదిశేషుడే.

ఆదిశేషుడిట్లు సింహాసనముగా, ఛత్రముగా మారి సేవచేయుననుటను -పురాణ దివ్యసూరి-పూర్వాచార్యసూక్తులు అనేకములు స్పష్టము చేయుచున్నవి. శ్రీభాగవతములోని "మృణాళ గౌరాయతశేషభోగపర్యంక ఏకం పురుషం శయానమ్, ఫణాతపత్రాయతమూర్ధరత్నద్యుభిః" (3-8-23) అను సూక్తియు, శెన్ఱాల్ కుడైయామ్" ఇత్యాది దివ్యసూరి సూక్తులు, "వర్షాతపవారణాదిభిః" అను భగవ ద్యామునసూక్తియు ఇందులకు అనుగుణముగా అనుసంధేయములు. వైకుంఠమున ఎండ-వానల ప్రసక్తి లేకున్నను ఆదిశేషుడు మంగళాశాసన తత్పరుడగుటచే అస్థానే భయశంకతో తనపడగలను గొడుగుగాచేసి సేవించు చున్నాడనియు చెప్పవచ్చును. కాని భగవానుడు దివ్యసింహాసనమున కూర్చున్న స్థితి ప్రస్తుతము. కావున పైయోజనయే స్వరసమని తోచును. సింహాసనీభూయ, ఛత్రయిత్వా అను

ప్రయోగములందు ఉపమాలంకారము కలదు. స ఏకధా భవతి ద్విధాభవతి అనేకధా భవతి అనుచు శ్రుతి నిత్యులు, ముక్తులు పలురూపములలో స్వామిని సేవించు చుందురని తెలిపిన అర్థమిచట అనుసంధింపబడినది. ఇట్లు 4వ, 5వ శ్లోకములు రెండును భగవానుని పరరూపమును ఆదిశేషుడు సేవించు వైభవమును విశదీకరించుచున్నది.

పర్యంకీకృత్య భోగం స్వం స్వపంతం తత్ర మాధవమ్।
సేవమానం సహస్రాక్షం నాగరాజ ముపాస్మహే॥ 6

అర్థము :- స్వం భోగమ్=తన శరీరమును,పర్యంకీకృత్య= శయ్యగాచేసి, తత్ర= అందు, స్వపంతమ్=నిద్రించునట్టి,మాధవమ్=శ్రియఃపతిని, సేవమానమ్= సేవించు చున్న, సహస్ర+అక్షమ్=వేయికన్నులను కలిగిన, నాగరాజమ్=నాగులకు ప్రభువగు ఆదిశేషుని, ఉపాస్మహే=ఉపాసింతుము.

తాత్పర్యము :-ప్రస్తుతశ్లోకము, అనంతర శ్లోకమును పాలకడలిలో శయనించి యుండు భగవానుని వ్యూహరూపమును ఆదిశేషుడు సేవించు ప్రకారమును వర్ణించుచున్నవి. తన శరీరమును భగవానునకు పడకగాచేసి,అందు యోగనిద్రలో నున్న స్వామి స్వాపకాలిక సౌందర్యమును వేయికన్నులతో సేవించుచున్న, నాగ ప్రభువగు ఆదిశేషుని ఉపాసింతుము.

వ్యాఖ్యానము :--సరోయోగి వచించిన "అణైయామ్ తిరుమాఱ్కరవు" అనుసూక్తిని, శ్రీయామునుల నివాసశయ్యాసన, ఫణిపతిఃశయ్యా అను సూక్తులను ఇచట స్మరింపనగును. సర్పశరీరమునకు భోగమనిపేరు.తనపై పరుండియున్నస్వామిని ఆదిశేషుడు వేయికన్నులను కలవాడై సేవించుచున్నాడనుట ఒక వాక్ చమత్కృతి. దీనివలన ఆదిశేషుడు భగవానుని స్వాపకాలిక సౌందర్యమును దర్శించుటలో ఆదరాతిశయము కలవాడనుట తెలియుచున్నది. ఇచటి సహస్రశబ్దము పూర్వ శ్లోకములోవలె "సహస్ర శీర్షాః పురుషః సహస్రాక్షః"అనునపుడువలె అనేకమని అర్థమిచ్చుపదమే కాని, కేవలము వేయి అని అర్థమిచ్చునదికాదు. లేనిచో, వేయి పడగలున్న ఆదిశేషునకు రెండువేల కన్నులుకదా ఉండవవలయును! మాధవం సేవమానం సహస్రాక్షం నాగరాజ ముపాస్మహే అని పదములను సమభివ్యాహార మొనర్చి, అన్వయించుటవలన తత్క్రతున్యాయానుసారముగా ఆదిశేషునివలె తాను

సహస్రాక్షుడై భగవానుని స్వాపకాలిక సౌందర్యమును దర్శింపవలెనని స్తుతికర్త ఆశపడిరని, క్రియాపదము లోని బహువచనస్వారస్యముచే అట్టి ఫలము తామేకాక, తమవలె అందఱును పొందవలెనని ఆశపడిరని స్ఫురించుచున్నది.

భగవానుడు ఇట్లు ఆదిశేషునిపైపరుండుట - తన దివ్యరూపమును అనుభవింపవలెనని ఆశపడిన భక్తులకు ఆరూపమును వారివశము చేయుననుటకు తార్కాణమని ఆచార్యులు వివరించిరి. ఇట్లు తన భోగమును స్వామి వశమొనర్చిన ఆదిశేషుడు స్వామి దర్శనమను పరమభోగమును అనుభవించి, పరమభోగి అయ్యెను. ఉత్తమపర్యంకలక్షణములుగా చెప్పబడు ధావళ్యము, సౌకుమార్యము, సౌగంధ్యము, వైశాల్యము, ఔన్నత్యము, శైత్యము మొదలగు లక్షణము లన్నియు ఆదిశేషునకు ఉండుట గమనార్హము. కావున తిరుప్పావై ప్రబంధములోని “పంచశయనత్తిన్ మేలేఱి” అను సూక్తియందలి పంచశయనశబ్దము ఆదిశేషుని సూచించుననుటలోకూడ స్వారస్యము కలదుకదా!

శరదభ్రరుచి స్వాంకశయిత శ్యామసుందరా।
శేషస్య మూర్తి రాభాతి చైత్రపర్వ శశాంకవత్॥ 7

అర్థము :-శరత్+అభ్రరుచి=శరత్కాలములోని మేఘములయొక్కకాంతివంటి కాంతిని కలిగినది,స్వ+అంక=తన ఒడిలో,శయిత=శయనించిన,శ్యామసుందరా= శ్యామసుందరుడైన భగవానుని కల్గినదిఅగు, శేషస్య=ఆదిశేషునియొక్క మూర్తిః= రూపము, చైత్రపర్వ= చైత్రమాసములోని పున్నమినాటి, శశాంకవత్= చంద్రునివలె, ఆభాతి=మిక్కిలి వెలుగొందుచున్నది.

తాత్పర్యము :- తెల్లని ఆదిశేషునిపై నల్లనిరూపముకల భగవానుడు పరుండిన సన్నివేశమును చక్కని ఉపమానముతో అభివర్ణించుట ఇందలి ప్రధానాంశము.

శరత్కాలమేఘములవలె తెల్లనిరంగును కలవాడు, తన ఒడిలో పరుండిన నల్లని వర్ణమునుకల భగవానుని కలవాడగు ఆదిశేషుని రూపము చైత్రమాసములో పౌర్ణమి తిథియందు వెలుగునట్టి చంద్రునివలె మనోహరముగా ప్రకాశించుచున్నది.

వ్యాఖ్యానము :-వలయాకారముగా చుట్టుకొనియున్న ఆదిశేషుని తెల్లని శరీరము తెల్లనిచంద్ర బింబముగా,అందు శయనించియున్న నల్లనిదేహవర్ణమునుగల స్వామి

రూపము ఆ చంద్రునిలోని నల్లనిగుర్తుగా కవి ఉపమించిరనదగును. "మూర్ఛతి మూర్ఛయతి -మూర్ఛామోహ సముచ్ఛ్రాయయోః" అను మూర్తిశబ్ద వ్యుత్పత్తినిబట్టి ఉన్నతమైనది, చూచువారికి మోహమునుకల్గించునది అను అర్థమిచ్చు మూర్తి శబ్దమును ఇచట ప్రయోగించుట మిక్కిలి తగినది.

> సౌమిత్రీభూయ రామస్య గుణై ర్దాస్య ముపాగతః ।
> శేషత్వానుగుణం శేష స్తస్యాసీత్ నిత్యకింకరః ॥ 8

అర్థము :- సౌమిత్రీభూయ=సుమిత్ర కుమారుడగు లక్ష్మణుడై, రామస్య= శ్రీరామ చంద్రునియొక్క, గుణైః=సద్గుణములచే, దాస్యమ్=దాసత్వమును, ఉపాగతః =పొందినవాడైన,శేషః= ఆదిశేషుడు, శేషత్వ+అనుగుణమ్=తన శేషత్వస్వభావము నకు అనుగుణముగా, తస్య=ఆ శ్రీరామునకు, నిత్యకింకరః=నిత్యము సేవచేయు వాడు, ఆసీత్=అయ్యెను.

తాత్పర్యము :- ఇంతవఱకు పరరూప వ్యూహ రూపములుగా తెలుపదగిన ఆదిశేషుని పరమ పదములోని రూపమును, పాలకడలిలోని రూపమును, వర్ణించిన పిదప కవి విభవ రూపముగా చెప్పదగిన, లక్ష్మణరూపమున ఆవిర్భవించిన ఆదిశేషుని స్వరూపమును ప్రస్తుతించు చున్నారు.

సౌమిత్రిగా ఆవిర్భవించిన ఆదిశేషుడు శ్రీరాముని సద్గుణములకు వివశుడై, అతనికి దాసుడై, తన శేషత్వమునకు అనురూపమైన నిత్యకైంకర్యమును చేసెను.

వ్యాఖ్యానము :-శ్రీరామాయణమున కిష్కింధాకాండలో లక్ష్మణుడు హనుమానునితో తనను గూర్చి పరిచయము చేసుకొనుచు "అహ మస్యావరో భ్రాతా గుణై ర్దాస్య ముపాగతః, కృతజ్ఞస్య బహుజ్ఞస్య లక్ష్మణో నామ నామతః" (4-11) అనుచు తాను శ్రీరాముని అనుజుడనని,అతని సద్గుణములకు దాసుడైతినని,తన పేరు లక్ష్మణుడని పలికెను.అట్లే, అయోధ్యాకాండలో శ్రీరామునితో లక్ష్మణుడు భవాంస్తు సహ వైదేహ్యా గిరి సానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపతశ్చతే (31-27) అనుచు సీతతో కలిసి వనమున విహరించు అతనికి సర్వకాలములందు సర్వవిధ కైంకర్యములను చేయుదుననెను.ఈ రెండు శ్లోకముల భావము ప్రస్తుతమున పూర్వార్థ ఉత్తరార్థములలో ఇమిడియుండుట గమనార్హము.

స్వభావముచేవచ్చిన శేషత్వము నిత్యము అగునుకాని, గుణములవలన కల్గిన దాస్యము గౌణ మగును, అనగా అనిత్యముకదా!అది సహజమైన శేషత్వమునకు ఎట్లు అనుగుణము? అను ప్రశ్న ఇచట కలుగవచ్చును. "గుణైః దాస్యముపాగతః" అనుట కేవలము గుణముల చేతనే దాసుడనైతిని అని అర్థముకాదు. స్వరూప ప్రయుక్తమైన దాస్యమునకు సద్గుణకృతమైన దాస్యము తోడయినచో అట్టి కైంకర్యము మిగుల రస్యము అగును అనియే తాత్పర్యము. తాను చేయుసేవ తనవిధి అను భావముతో గాక, సద్గుణములవలన కల్గిన ఆదరముతో, భక్తితోచేయుట ఆనంద దాయకము కదా! గోవిందరాజీయువ్యాఖ్యానమునను–"యద్యపి వరవానసీమిత్యాదౌ స్వరూపప్రయుక్తదాస్య ముక్తమ్, తథాపి గుణోత్తంభితం తద్దాస్యమితి తదవిరోధో ద్రష్టవ్యః" అని తెలుపబడినది. మఱియు శ్లోకములోని "నిత్యకింకరః" అనుపదము ఈ భావమునే సూచించు చున్నది. స్వరూపకృతదాస్యము నిత్యము, కేవలగుణకృత దాస్యము తాత్కాలికమునుకదా! మఱియు పైవ్యాఖ్యలోని–"తథా చ సమృద్ధిదశాయా మసమృద్ధి దశాయాం చ దాస్యోక్త్యా సహజత్వ ముపపాదితమ్, సహజమేవ కైంకర్యం గుణాస్తు తద్వర్ధకాః ఇతి భావః"–అని,"సహజసిద్ధ దాస్యవ్రతసంబంధినోఽపి భోగ్యత్వమాహ.గుణైరితి"అనియు కల వివరణము అనుసంధేయము. కావున స్వరూపకృతమగుటచే దాస్యము యొక్క నైసర్గికత్వము, గుణకృతమగుటచే దాని రస్యతయు ధ్వనించుచున్నవి.

శ్రీరామాయణమున– విష్ణో పుత్రత్వ మాగచ్ఛ కృత్వాత్మానం చతుర్విధమ్ (బాల–16–25) అనియు, అథ లక్ష్మణ శత్రుఘ్నౌ సుమిత్రాజనయత్ సుతౌ, వీరౌ సర్వాస్త్ర కుశలౌ విష్ణో రర్థ సమన్వితౌ (16–14) అనియు ఉండుటచే లక్ష్మణుడును విష్ణువు యొక్క అంశచే పుట్టెనని తెలియుచుండగా, శేషుని అంశతో ఆవిర్భవించెననుట ఎట్లు సంగతము? అనినచో, నారదీయపురాణములోని యాదవగిరి మాహాత్మ్యమునందు "అనంతః ప్రథమం రూపం త్రేతాయాం లక్ష్మణ స్తథా" అని,"సాక్షాదనంతః సగిరిః సర్వదా సేవతే హరిమ్,లక్ష్మణాకృతి మాస్థాయ త్రేతాయా మభ్యసేవత (11–78) అనియు మొదలుగాగల ప్రమాణములనుబట్టి లక్ష్మణుడు ఆదిశేషునిఅంశతో ఆవిర్భవించెనను పౌరాణికమైన అభిప్రాయమును

కలదు.కావున ఇదియును వేరొకయోజన అనిగ్రహింపనగును. అంతియేకాక శ్రీరామాయణమునకుగల మహేశ్వరతీర్థీయవ్యాఖ్యలో పూర్వము ఉదాహరించిన శ్రీరామాయణప్రమాణములు రెండిటిలో మొదటి ప్రమాణములోని "ఆత్మానం చతుర్విధమ్" అనుట- ఆత్మానం సోపకరణ మాత్మానమ్,-అన్యేద్యుః పాంచజన్యాత్మా కైకేయ్యాం భరతోఽ భవత్,తదన్యేద్యుః సుమిత్రాయా మనంతాత్మా చ లక్ష్మణః, సుదర్శనాత్మా శత్రుఘ్నో ద్వౌ జాతౌ యుగపత్ ప్రియే-ఇతి పాద్మోక్తేః' అని వివరింప బడుటయు ఇంచులకు నిదర్శనము. మఱియు ఆదిశేషుడు సాక్షాత్తు భగవానుని అంశఅని పలుపురాణములలో ఉద్ఘోషింప బడుచుండుటచే పూర్వోదాహృత శ్రీరామాయణసూక్తియు సంగతమగుచున్నది.

శ్రీరామునకు ఆదిశేషుని అంశవలన ఉద్భవించిన సౌమిత్రి నిత్యకైంకర్య మొనర్చెనని దివ్యసూరులు అభిప్రాయపడిరని పూర్వాచార్యులు పలుచోట్ల వివరించిరి. శఠకోపసూరి ప్రబంధములోని "నచ్చరవిన్ అణై"(5-9-4) అను సూక్తిని నంబిళ్ళై అను ఆచార్యులు వివరించుచు-"పడకయు తానేయై రక్షకుడును తానేయై యుండుట లక్ష్మణుడు చేతిలో వింటినిదాల్చి రక్షకుడైయుండగా శ్రీరాముడు, సీతాదేవియు వనమున ఆనందించినట్లు-" అని పల్కుట ఇందులకొక ఉదాహరణము. ఇట్లు ఆదిశేషుడు వ్యూహమునందేకాక అవతారము నందును శయ్యగా రక్షకుడుగా మారి సేవించెనని తెలియుచున్నది.

అత్త్వా లోకాన్ లయాంభోధౌ యదా శిశయిషు ర్హరిః ।
వటపత్రతను శ్శేషః తల్పం తస్యాభవ త్తదా॥ 9

అర్థము :- హరిః=భగవానుడు, లోకాన్=లోకములను, అత్త్వా=అరగించి (లయ మొనర్చి), లయ+ అంభోధౌ =ప్రళయసముద్రమునందు, యదా=ఎపుడు,శిశయిషుః (అభవత్)=శయనింప కోరినవాడు అయ్యెనో, తదా=అపుడు, శేషః=ఆదిశేషుడు, వటపత్రతనుః=మఱ్ఱిఆకురూపముకలవాడై,తస్య=ఆ హరికి, తల్పమ్=శయ్యగా, అభవత్=అయ్యెను.

తాత్పర్యము :-ప్రళయకాలమున భగవానుడు లోకములనన్నిటిని అరగించి, ప్రళయ సముద్రమున పరుండగోరినపుడు ఆదిశేషుడు మఱ్ఱిఆకుగామారి భగవానునకు శయ్య అయ్యెను.

వ్యాఖ్యానము :-"అత్త్వా లోకాన్" అను ప్రయోగమునకు అనుగుణముగా "యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః, మృత్యు ర్యస్యోపసేచనమ్" ఇత్యాది శ్రుతివాక్యములు, "అత్తా చరాచరగ్రహణాత్" అను బ్రహ్మసూత్రమును స్మరణీయములు. "ఆహరతి ఇతి హరిః" అను హరిశబ్దవ్యుత్పత్తి ఇచట వివక్షితము. లోకములను గ్రసించువాడని భావము. ఉపసర్గార్థము ధాత్వర్థమున లీనమైయుండునను న్యాయముననుసరించి ఈవ్యుత్పత్తి సంగతము. ఇట్లు ప్రళయకాలమున భగవానుడు ఒక్కడే మిగిలియుండునని "సదేవ సోమ్య ఇదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" ఇత్యాది శ్రుతివచనములు తెలుపుచున్నవి. మఱి శేషుడు ఎట్లు మిగిలియుండెను? అనినచో శేషుడు భగవానుని తామసమూర్తియని విష్ణుపురాణము తెలుపుచున్నందున పై శ్రుత్యర్థమునకు విరోధములేదని గ్రహింపనగును. "శిష్యతే కల్పాంతేఽపి ఇతి,శేతే హరిః అస్మిన్ ఇతి చ శేషః" అనుశేషశబ్ద వ్యుత్పత్తి ఇచట వివక్షితము. కల్పాంతమునందును మిగిలియుండువాడని, హరి ఇతనిపై శయనించునని అర్థములు. ఈరెండును ప్రకృతమున సంగతములే కావున శేషశబ్దప్రయోగము, అట్లే పూర్వోక్తరీత్యా హరిశబ్దప్రయోగమును సాభిప్రాయకములు.

ఆదిశేషుడు ప్రళయాబ్ధిలో వటవృక్షమై, భగవానునకు శయ్య అయ్యెననుటకు భట్టనాథుల "ఆలత్తిలైయాన్ అరవినణైమేలాన్" (2-6-6) అను సూక్తిని వ్యాఖ్యానించుచు శ్రీకృష్ణసూరి-శ్రీఅనంతుడను పడుకపై నిద్రించువాడు. సహస్రవదనో దేవః ఫణామణి విరాజితః, స ఏవ వటవృక్షోఽభూ దనంతోఽద్భుత రూపవాన్; ఆలత్తిలైయాన్ అరవి నణైమేలాన్-అనుటచే ఈ అర్థము స్ఫురించుచున్నది." అని వ్యాఖ్యానించుట ప్రమాణము.

పాదుకీభూయ రామస్య తదాజ్ఞాం పరిపాలయన్।
పారతంత్ర్యేఽతిశేషే త్వం శేష! తాం జానకీ మపి ॥ 10

అర్థము :- శేష=ఓ!ఆదిశేషా! త్వం=నీవు, రామస్య=శ్రీరామునకు, పాదుకీభూయ=పాదుకలుగా మారి,తత్+ఆజ్ఞామ్=ఆశ్రీరామునిఆజ్ఞను,పరిపాలయన్= పరిపాలించువాడవై,పారతంత్ర్యే = పారతంత్ర్యమునందు, తామ్=ఆ; జానకీమ్ అపి=సీతాదేవిని కూడ, అతిశేషే=మించియున్నావు.

**తాత్పర్యము** :- ఓ! ఆదిశేష స్వరూపా! నీవు శ్రీరామునకు పాదుకలుగా మారి సేవించుట ద్వారా నీశేషత్వపరాకాష్ఠను ప్రకటించితిని. అంతియేకాదు ఆశ్రీరాముని అజ్ఞానుసారము పాదుకలరూపమున భరతునివెంట వెడలి పారతంత్ర్యముయొక్క పరమావధిని అధిగమించితివి. ఈ విషయమున నీవు సీతాదేవిని కూడ మించి యున్నావు.

**వ్యాఖ్యానము** :-ఇంతవరకు ఆదిశేషావతారమగు లక్ష్మణుని శేషత్వ వైభవమును వర్ణించిన కవి, ఇందు అభక్తుని పారతంత్ర్య పరాకాష్ఠను స్తుతించుట ప్రధానాంశము. శేషత్వ పారతంత్ర్యములు రెండును పైపైన ఒకటిగానే తోచినను, ఆరెండిటిమధ్య భేదము కలదు. శ్రీమద్వరవర మునులు ఆచార్యహృదయమను రహస్యగ్రంథమునకు రచించినవ్యాఖ్యలో " శేషత్వమనగా ఇష్ట వినియోగార్హతామాత్రము. పారతంత్ర్యము అనగా శేషికి ఇష్టమైనపద్ధతిలోఉపయోగపడుట. ముద్ద బంగారము వంటిది శేషత్వము, ఆభరణముగా మారిన బంగారమువంటిది పారతంత్ర్యము అనుచు సోదాహరణ ముగా అనుగ్రహించిన వివరణము ప్రకృతమున స్మరణీయము. కావున శేషత్వము అర్హతకాగా,అది క్రియా రూపమును దాల్చుట పారతంత్ర్యము అనునది పిండి తార్థము. శ్రీరామాయణమును పరిశీలించినచో ఆదిశేషుని అవతారమగు లక్ష్మణుడు శేషత్వ, పారతంత్ర్యములను రెండిటిని కలవాడని తెలియును. శ్రీరాముడు వనవాసమునకు పోవునపుడు లక్ష్మణుడు తాను కూడ అతనివెంటవచ్చెదనని పల్కెను. అపుడు శ్రీరాముడు మయాద్య సహ సౌమిత్రే త్వయి గచ్ఛతి తద్వనమ్, కో భరిష్యతి కౌసల్యాం సుమిత్రాం వా యశస్వినీమ్, సౌమిత్రే భర కౌసల్యా ముక్తమర్థ మిమం చర,ఏవం మయిచ తే భక్తిః భవిష్యతి సుదర్శితా,ధర్మజ్ఞ గురు పూజాయాం ధర్మశ్చాప్యతులో మహాన్, ఏవం కురుష్వ సౌమిత్రే మత్కృతే రఘునందన అనుచు అతనితో తనవెంట రావలదని, కౌసల్యను, సుమిత్రను, కైకేయిని దశరథుని కాపాడుమని,అట్లుచేసినచో తనయందు భక్తి ప్రదర్శించి నట్లగుటయేకాక గురుశుశ్రూషను చేసినవాడవు అగుదువని,తన కొఱకు ఆ విధముగా చేయనగునని పల్కెను. కాని లక్ష్మణుడు "సీతా మువాచాతియశాః రాఘవంచ" అనురీతిలో సీతాదేవినిపురుషకారముగాగొని, శ్రీరాముని ప్రార్థించి, అతని వెంట అరణ్యమునకు వెడలెను. ఈ సందర్భమును గమనింపగా లక్ష్మణుడు

శ్రీరాముని సేవించుట తన అభిమతానుసారమేగాని,శ్రీరాముని అభిమతానుసారము కాదని అపాతతః భాసించును. ఇట్టి శంకను పరిహరింపగోరిన కవి ప్రకృత శ్లోకమున చక్కని దృష్టాంతమును చూపుటద్వారా లక్ష్మణుని భగవత్పారతంత్ర్య నిష్ఠకు ఎట్టిలోటులేదని, అందు జానకీదేవినికూడ అతడు అతిశయించెనని పల్కుచున్నారు. భరతుడు తల్లులతో, వశిష్ఠాది గురుజనులతో కలసి శ్రీరామునివద్దకు పోయి, అయోధ్యకు తిరిగి వచ్చి రాజ్యపాలనను చేయుమని ప్రార్థించినపుడు, శ్రీరాముడు తన ప్రతినిధిగా తాను ధరించు పాదుకలను ఇచ్చి,తాను అయోధ్యకు తిరిగివచ్చువరకు ఆ పాదుకలపేరుతో రాజ్యపాలనను చేయుమనెను. ఇట్లు శ్రీరాముడు భరతునకు ఇచ్చిన పాదుకలు సాక్షాత్తు ఆదిశేషుని రూపమే అని కవి వచనము. ఇందులకు సరోయోగి ప్రబంధములోని- 'నిన్హాల్మరవడి యామ్' (కిం కర్తవ్యతా భావనతో నిలచిన పాదుకలగును) అనుసూక్తి, "పాదుకాంశుక" ఇత్యాది శ్రీయామునుల స్తోత్రరత్న సూక్తి(40) మూలములు. శ్రీయామునుల సూక్తిని వ్యాఖ్యానించుచు శ్రీదేశికులు- "పాదుకే- అధిరోహార్య పాదాభ్యాం పాదుకే హేమభూషితే,ఏతే హి సర్వలోకస్య యోగక్షేమం విధాస్యతః -ఇత్యవతారదశాయామ్ ప్రసిద్ధ వైభవే" అని వివరించుటయును గమనార్హము. కావున శ్రీరామునకు పాదుకలై అతనిని సేవించు ఆదిశేషుడు ఆ స్వామి ఆజ్ఞానుసారము భరతుని వెంట అయోధ్యకుచేరి స్వామి ప్రతినిధిగా నుండి, తన భగవత్పారతంత్ర్య పరాకాష్ఠను చాటెను.ఈ అంశమును శ్రీదేశికులు పాదుకాసహస్రములోని-రామే వనం వ్రజతి పంక్తిరథే ప్రసుప్తే రాజ్యాపవాదచకితే భరతే తదానీమ్, ఆశ్వాసయేత్ క ఇవ కోసలవాసిన స్తాన్ సీతేవ చేత్ త్వమపి సాహసవృత్తి రాసీః" అను (107) శ్లోకమున సంభావించిరి. ఇందులకు ఆ శ్లోకమును వ్యాఖ్యానించు భారద్వాజ శ్రీనివాసాచార్యులవారు "సీతాపేక్షయాపి త్వం పారతంత్ర్యవతీతి భావః" అని వివరించుట నిదర్శనము. కావున ఆదిశేషుని అవతారమైన లక్ష్మణుడు శ్రీరామునకునకు పాదుకలై సేవచేయుటయేగాక, అతనికి సర్వదా పరతంత్రుడగుటలో సీతాదేవినికూడ మించెనని ఏర్పడుచున్నదికదా! శ్రీరామచంద్రుడు తనతో అడవులకు రావలదని ఎన్నివిధములుగ చెప్పినను వినక సీతాదేవి అతనితో అరణ్యమునకు వెడలినదను విషయము స్మర్తవ్యము.

చిరం విహృత్య విపినే సుఖం స్వపితు మిచ్ఛతోః ।
సీతారాఘవయో రాసీ దుపధానం ఫణీశ్వరః ॥ 11

అర్థము :- విపినే=దండకారణ్యమున,చిరమ్=చాలకాలము,విహృత్య=విహరించి, సుఖం=సుఖముగా, స్వపితుమ్=నిద్రించుటకు,ఇచ్ఛతోః=కోరునట్టి,సీతారాఘవయోః =సీతారాములకు, ఫణీశ్వరః=సర్పరాజగు ఆదిశేషుడు, ఉపధానమ్=తలదిండుగా, ఆసీత్=అయ్యెను.

తాత్పర్యము :- సీతారాములు వనమున చిరకాలము విహరించినపుడు వారు నిద్రింపగోరు సమయమున ఆదిశేషుడు వారికి తలదిండుగామారి సేవించెను.

వ్యాఖ్యానము :- "భవాం స్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపత శ్చ తే" అనుచు లక్ష్మణుడు శ్రీరాముడు సీతాదేవితో పర్వత సానువులందు విహరించునపుడు,నిద్రించునపుడును అన్నివిధములైన సేవలను ఆ దివ్యదంపతులకుచేయుదుననెనుకదా! పూర్వశ్లోకమున శ్రీరాముని జాగ్రద్దశలో సేవించు ప్రకారవిశేషము తెలుపబడగా, ఇందు సీతారాములు నిద్రించునపుడు సేవించువిధము వర్ణింపబడినది. "ఉపధాయ భుజం తస్య లోకనాథస్య" అనుచు సీతాదేవి శ్రీరాముని భుజము తనకు తలదిండు అనెను. భట్టరును ఈభావమును "కమలాలీలోపధానం మహత్" అనుచు అనుసంధించిరి. కాని, ఆదిశేషుడు ఒక్కరికి మాత్రమేకాక, ఆ దంపతు లిద్దతికిని తలదిండు అగుట విశేషముకదా!ఈ శ్లోకము సరోయోగి వచించిన పుల్కుమ్ అణైయామ్(53) (తడవునట్టి తలదిండుగను) అనుసూక్తిని,శ్రీయామునుల "అంశుకోపధాన"(40) అను ప్రయోగమునుఅనుసరించి రచింపబడినది. ఒకే వ్యక్తి శయ్యగా, తలదిండుగా ఎట్లయ్యెను? అనిన, నిత్యసూరులకు "ఏకధా భవతి ద్విధా భవతి--సహస్రధా భవతి" అను రీతిలో పలురూపములను ఏకకాలమున పొందుశక్తి కలదుకదా!

దేవకీగర్భ మావిశ్య హరే స్త్రాతాసి శేష! భోః ! ।
సత్సంతానార్థిన స్తస్మాత్ త్వత్ ప్రతిష్ఠాం వితన్వతే॥ 12

అర్థము :- భోః శేష= ఓ ఆదిశేషమూర్తీ !, దేవకీ గర్భమ్= దేవకీదేవిగర్భమును, ఆవిశ్య= ఆవేశించి,హరేః=విష్ణువునకు, త్రాతా= రక్షకుడవై, అసి=ఉన్నావు, తస్మాత్=

అందువలన, సత్సంతాన+అర్థినః=చిరంజీవులయిన సంతానమును పొందగోరు వారు, త్వత్= నీయొక్క ప్రతిష్ఠామ్= ప్రతిష్ఠను, వితన్వతే=విస్తరింపచేయుచున్నారు. (కావించుచున్నారు.)

**తాత్పర్యము** :-ఓ! ఆదిశేషమూర్తీ ! దేవకీదేవి గర్భమునందు ప్రవేశించిన నీవు ఆమెకు తదనంతరము అవతరింపబోవు విష్ణువునకు (శ్రీకృష్ణునకు)రక్షకుడవైతివి. కావున సంతానమును రక్షించు నీ ఈ మహిమలను తెలిసిన సత్సంతానార్థులైన భక్తులు నీప్రతిష్ఠను గుర్తించి (నాగప్రతిష్ఠను) విరివిగా చేయుచున్నారు.

**వ్యాఖ్యానము** :- కంసుడు దేవకీదేవికి కల్గిన ఆర్గురు సంతానమును వధించెను. ఏడవ సంతానముగా భగవన్నియమనముచే ఆదిశేషుడు ఆమె గర్భమున ప్రవేశించెను. అపుడు కొంత కాలమైన పిదప భగవానుని ఆజ్ఞానుసారము యోగమాయ ఆది శేషాంశతోనున్న దేవకీదేవి గర్భమును కొనిపోయి, గోకులములో నున్న వసుదేవుని వేరొక పత్నియగు రోహిణీదేవి గర్భమున ప్రవేశింపచేసెను. జనులందరితో పాటు కంసుడును దేవకీదేవికి గర్భవిచ్ఛేదనము కల్గెనని తలచెను. పిమ్మట భగవానుడు దేవకీదేవికి ఎనిమిదవ సంతానమై అవతరించెను. ఇట్లు భగవానుడు దేవకికి అష్టమ సంతానముగ అవతరించెనని కంసుడు గుర్తింపలేకుండు నట్లు ఆదిశేషుడు ముందుగా దేవకీదేవి గర్భమున ఆవేశించుటద్వారా అష్టమ సంతానమునకు రక్షకుడయ్యెను. ఈ వృత్తాంతము శ్రీవిష్ణుపురాణ- శ్రీభాగవత-హరివంశాదులలో కలదు. శ్రీభాగవతములోని **హతేషు షట్సు బాలేషు దేవక్యా ఔగ్రసేనినా, సప్తమో వైష్ణవం ధామ యమనంతం ప్రచక్షతే, గర్భో బభూవ--దేవక్యా జఠరే గర్భం శేషాఖ్యం ధామ మామకమ్, తత్సన్నికృష్య రోహిణ్యా ఉదరే సన్నివేశయ, అథాహ మంశభాగేన దేవక్యాః పుత్రతాం శుభే ప్రాప్స్యామి**'(10-2-4,7,8) ఇత్యాది వచనము లిందులకు ఉదాహరణములు.

ఈ విధముగా దేవకీదేవికి కలుగబోవు అష్టమసంతానమునకు ఆది శేషుడు రక్షకుడగుటను బట్టి తదనంతరకాలమున సత్సంతానార్థులైన భక్తులు అనగా జీవించియున్న పుత్రులను పొందవలెనని కోరువారు గర్భవిచ్ఛేదనము కలుగకుండుటకై నాగప్రతిష్ఠను చేయుదురు. అట్లు ప్రతిష్ఠచేయు విగ్రహమున ఇరువైపుల సర్పములు, వానిమధ్యలో శ్రీకృష్ణుని రూపమును ఉండుట విశేషము.

కాళహస్తి మొదలగు క్షేత్రములలో ఇట్టి నాగప్రతిష్ఠలు ఈనాటికిని జరుగుటను చూడవచ్చును. అనంతేష్టిలోకూడ సంకల్పము నందు "సత్సంతాన ప్రాప్త్యర్థమ్" అని చెప్పుటయును గమనింపవచ్చును.

గృహీత్వా స్వశిశుం యాతి వసుదేవే వ్రజమ్ ద్రుతమ్ ।
వర్షత్రీభూయ శేష త్వం తం రిరక్షిషు రన్వగాః ॥ 13

అర్థము:-స్వశిశుమ్= తనకుమారుని, గృహీత్వా=తీసికొని, ద్రుతమ్=వేగముగా, వ్రజమ్=రేపల్లెకు, వసుదేవే యాతి=వసుదేవుడు వెడలుచుండగా,శేష=ఆదిశేషా! త్వమ్=నీవు, తమ్=ఆ శిశువును, రిరక్షిషుః=కాపాడ గోరినవాడవై, వర్షత్రీ భూయ= వర్షమునునివారించు గొడుగువై, అన్వగాః=అనుసరించితివి.

తాత్పర్యము :-దేవకీగర్భమున ఎనిమిదవ సంతతిగా అవతరించిన బాలుని వసుదేవుడు ఆనాటి రాత్రిలోనే రేపల్లెకు రహస్యముగా తీసికొనిపోయెను. అపుడు ఆదిశేషుడు ఆ శిశువునకు వర్షమువలన బాధకలుగకుండునట్లు రక్షింపగోరి తనపడగలను గొడుగుగా చేసి అనుసరించెను.

వ్యాఖ్యానము :-ఈ అంశము శ్రీభాగవతమున "శేషోఽన్వగాత్ వారి నివారయన్ ఫణైః"(10-3-48)అని,శ్రీవిష్ణుపురాణమున వర్షతాం జలదానాంచ తోయ మత్యుల్బణం నిశి, సంవృత్యానుయయౌ శేషః ఫణైరానకదుందుభిమ్(5-3-17) అనియు తెలుపబడినది. శెన్ఱాల్ కుడైయామ్"(వెడలిన గొడుగు అగును.) అను సరోయోగి వచనమును, "వర్షాతప వారణాదిభిః" అను స్తోత్రరత్నసూక్తినికూడ ఇచట స్మరింపనగును.

ప్రసూనద్భిః ఫణారత్నైః నికుంజీభూయ భోగిరాట్।
రాధామాధవయో రాసీత్ సంకేతస్థాన ముత్తమమ్॥ 14

అర్థము:- ప్రసూనద్భిః=వివిధ వర్ణములతో పూలవలె ప్రకాశించునట్టి, ఫణారత్నైః =పడగలలోని రత్నములతో,నికుంజీభూయ=పూపొదరిల్లుగా మారి, భోగిరాట్= నాగరాజగు ఆదిశేషుడు, రాధా మాధవయోః=రాధాకృష్ణులకు,ఉత్తమం=ఉన్నతమైన (గొప్పదైన), సంకేతస్థానమ్=కలసి కొనుచోటుగ;ఆసీత్=అయ్యెను.

తాత్పర్యము :-పలువర్ణములతో వికసించిన పూలవలె ప్రకాశించునవి, పడగలపై

నున్నవగు రత్నముల కాంతితో ఆదిశేషుడు పూలపొదరిల్లుగా మారి, రాధాకృష్ణులు కలియునట్టి గొప్పదైన సంకేతస్థానమయ్యెను.

వ్యాఖ్యానము :- శ్రీయామునుల స్తోత్రరత్నములోని "నివాస శయ్యాసనా"ది శ్లోకములోగల నివాసపదముయొక్క అర్థమిచట ఒక చక్కని ఉపమాలంకృతితో వివరింపబడినది. ఆదిశేషుని పడగలు పొదరిల్లుగా,అందలి రత్నములు వివిధ వర్ణములు గల పూవులుగా ఇచట భావింపబడినవి. నాయకీనాయకులు రహస్యముగా కలసికొను సంకేతస్థానములుగా పొదరిండ్లు సుప్రసిద్ధములు.

రాధాకృష్ణుల ప్రణయవృత్తాంతము భాగవత విష్ణుపురాణాదులలో కానరాకున్నను పురాణాంతరములో కలదు. రాధ వృషభాను-కళావతుల కుమార్తె. కృష్ణుడనిన ఈమెకు ప్రేమ మెండు. శ్రీకృష్ణుడును ఈమెయందు అనురాగమును కలిగియుండెను. వీరి అనురాగమును జయదేవుడను సంస్కృతకవి గీత గోవిందమున రమణీయముగా గీతముల రూపమున వర్ణించెను. శ్లోకములోని "రాధామాధవయోః" అను ప్రయోగము "ప్రత్యధ్వ కుంజద్రుమంరాధా మాధవయోః జయంతి యమునాకూలే రహః కేళయః"అను జయదేవుని సూక్తిని స్మరింపచేయును.

భగవచ్ఛేషభూతై స్త్వ మశేషైః శేష గీయసే।
ఆదిశేష ఇతి శ్రీమన్!సార్థకం నామ తే తతః ॥ 15

అర్థము:- శేష=ఆదిశేషస్వరూపా!,అశేషైః=అన్నివిధములైన,భగవచ్ఛేషభూతైః= భగవానునకు శేషములైనరూపములతో,ఆదిశేషః ఇతి=ఆదిశేషుడవని, త్వమ్=నీవు, గీయసే= కీర్తింపబడు చున్నావు. శ్రీమన్=కైంకర్యలక్ష్మిని కలవాడా!,తతః= అందుచే, తే= నీయొక్క, నామ=పేరు, సార్థకమ్=అర్థవంతము.

తాత్పర్యము:- ఆదిశేషస్వరూపా!నీవు అన్నివిధములైన,స్వరూపానురూపములైన రూపముల దాల్చి స్వామిని సేవింతువు. కావున నిన్ను అందఱు ఆదిశేషుడవని కీర్తింతురు. నీవిట్లు అన్నిరీతులలో భగవానునకు శేషభూతుడవని అందఱిచే కీర్తింపబడుటచే నీకు ఆదిశేషుడను పేరు సార్థకము.

వ్యాఖ్యానము :-ఈశ్లోకము స్తోత్రరత్నములోని 'శరీరభేదైః తవ శేషతాంగతైః యథోచితం శేష ఇతీరితే జనైః' అనుసూక్తిని అనుసరించుచున్నది. శ్రీపిళ్ళైలోకాచార్యుల

వారును అర్చిరాది అను గ్రంథములో శేషశబ్దమును వివరించుచు "సర్వవిధ కైంకర్యమును చేయువారి కందఱకు ఉపమానమైయుండుటచే శేషుడనుపేరును కలవాడై"అని పల్కిరి. ఈ విధముగానే శ్రీకృష్ణసూరియు నివాసశయ్యాసన ఇత్యాది స్తోత్రరత్నశ్లోక వ్యాఖ్యానావతారికలో "ఉపమానమశేషాణాం సాధూనామ్" అను న్యాయము చొప్పున దాస్యమునందు రుచికల వారందఱకు ఉదాహరణ భూతము లుగా ఆదిశేషుని కైంకర్య విశేషములుండును కదా! అని పల్కుటయు ప్రకృతమున స్మరణీయము. కావున "శేషాణా మాదిః ఆదిశేషః"అను విగ్రహమును బట్టి శేష భూతులలో అగ్రగణ్యుడైన ఈ పరమభక్తునకు ఆదిశేషుడనుపేరు సార్థకముకదా! శ్లోకమున ఇతి అను పదము ప్రసిద్ధి ద్యోతకము.

**అనంతశ్చాస్మి నాగానా మితి గీతాసు సన్నుతః ।**
**అనంతోఽనంతకైంకర్య సంపదాప్యేత్యనంతతామ్॥ 16**

**అర్థము :-** నాగానామ్=పలుశిరస్సులుకల సర్పములలో,అనంతః=అనంతుడనై, అస్మి=ఉన్నాను. ఇతి=అని,గీతాసు=భగవద్గీతలో,(శ్రీకృష్ణభగవానునిచే),సన్నుతః= స్తుతింపబడిన, అనంతః=అనంతుడు,అనంతకైంకర్యసంపదా=అంతులేని కైంకర్య సంపదచే,అపి= కూడ, అనంతతామ్= అనంతత్వమును, ఏతి=పొందుచున్నాడు.

**తాత్పర్యము :-**అనంతశబ్దనిర్వచనమును విలక్షణమైనరీతిలో తెలుపుట ఈ శ్లోకమున ప్రధానాంశము. శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతలో "నాగులలో అనంతుడనై యున్నాను." అని ఆదిశేషుని వైభవమును స్తుతించెను. అట్టి అనంతుడు అనంతకైంకర్యమును స్వామికి చేయుటద్వారా సార్థకనామధేయుడయ్యెను.

**వ్యాఖ్యానము :-**భగవానుని లావణ్యము అప్రాకృతము.దాని వైభవము వర్ణింప సామాన్యులకు సాధ్యముకానిది. ప్రకృష్టవిజ్ఞాననిధియైనఆదిశేషునకు వేయినోళ్లతో కూడ పొగడవలసి యున్నది. ఇక అతడు తన వేయిముఖములతో స్వామి లావణ్యమును వర్ణించుట ఎట్టిది? అనుటకు భట్టరు శ్రీరంగరాజ స్తవములోని "యది మే సహస్రవదనాది వైభవం నిజమర్పయేత్ స కిల రంగచంద్రమాః , అథ శేషవత్ మమచ తద్వదేవ వా స్తుతిశక్త్యభావ విభవేఽపి భాగితా" అను రీతిలో స్వామిలావణ్యము వర్ణనాతీతమని పల్కుటయే అనదగును. వేయి నోళ్ళనుగల ఆదిశేషుడును భగవల్లావణ్యవైభవము వర్ణనాతీతమనిమాత్రమే పల్కుట ఎట్లు స్తుతి

యగును?అనినచో,అట్లనుట భగవద్వైభవముయొక్క అపరిమితత్వమును తెలుపును, కావున స్తుతియేయగును. కావున పూర్తిగా స్తుతించుననుటభగవానుని లావణ్యము నకు పరిమితత్వ దోషమును కల్గించును కావున నిందయేయగునుకదా! లావణ్యమనగా సముదాయ శోభ. సౌందర్యము ప్రత్యంగశోభ.

**అహో! విషధరోఽ ప్యేషః శేషః శ్రీపతిసేవనాత్ ।**
**సహస్రశీర్ష్యోనంతోఽభూత్ సహస్రాక్షః సహస్రపాత్ ॥ 17**

**అర్థము :-** అహో!=ఆహా!, ఏషః=ఈ, శేషః= ఆదిశేషుడు,విషధరః+అపి=విషధరు డైనను, శ్రీపతి సేవనాత్=భగవత్సేవవలన,సహస్రశీర్షః=సహస్రశిరస్సులను కలవాడు, అనంతః=అనంతుడు,సహస్రాక్షః=వేయికన్నులను కలవాడు, సహస్రపాత్= వేయి పాదములనుకలవాడును,అభూత్=అయ్యెను.

**తాత్పర్యము :-** ఈ ఆదిశేషుడు విషధరుడైనను, శ్రీమన్నారాయణునిసేవించుటవలన సహస్రశీర్షుడు,అనంతుడు, సహస్రాక్షుడు, సహస్రపాదుడను అయ్యెను. ఆశ్చర్యము!

**వ్యాఖ్యానము :-** భగవానుని కొలిచిన భక్తుడు నిరంజనః పరమం సామ్య ముపైతి అనునట్లు భగవానునితో పరమసామ్యాపత్తిని పొందును." తనను నిత్యము కొలుచు వారికి తనతోటి సామ్యమును అనుగ్రహించును."అని భట్టనాథసూరి పై శ్రుత్యర్థమును అను సంధించిరి. ఆ అంశమే ప్రస్తుతమునను తెలుపబడినది. భగవానుడు సహస్రశీర్షుడు, అనంతుడు, సహస్రాక్షుడు,సహస్రపాదుడును.ఇట్టి భగవానుని ఆదిశేషుడు నిత్యము సేవించుటవలన అతడును అట్టివాడే అయ్యెను. ఆదిశేషునకు వేయితలలు కలవు కావున సహస్రశీర్షుడు. నాంతం గుణానాం గచ్ఛంతి తేనానంతోఽయమవ్యయః అనునట్లు అనంతములైన కల్యాణగుణము లను కలవాడు కావున అనంతుడు. అట్లే సహస్రాక్షుడు, సహస్రపాదుడును. ఈ రెండునామములలోని సహస్రపదము అనేకార్థకము. కేవల సహస్రార్థకము కాదు.ఈ శ్లోకమున పురుషసూక్త ప్రారంభములోని సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ అను పదములు యథా తథముగ ప్రయోగింపబడిన అందము గమనింపదగినది.

**హరేః శ్రీపాదచిహ్నాని ధత్తే శీర్షైః ఫణీశ్వరః ।**
**చిహ్నాని స్వామినో దాసైః ధర్తవ్యానీతి బోధయన్॥ 18**

**అర్థము** :- ఫణి+ఈశ్వరః=నాగరాజగు ఆదిశేషుడు,స్వామినః=స్వామియొక్క చిహ్నాని=గుర్తులు, దాసైః=దాసులచే, ధర్తవ్యాని+ఇతి=ధరింపదగినవి అని, బోధయన్=తెలుపువాడై,శీర్షైః=తలలతో(పడగలతో),హరేః=హరియొక్క శ్రీపాదచిహ్నాని= దివ్యములైన పాదముల గుర్తులను, ధత్తే=ధరించుచున్నాడు.

**తాత్పర్యము** :-ఆదిశేషుని పడగలలో భగవానుని పాదచిహ్నములు కలవు.అట్లు అతడు తన తలలపై భగవత్పాదముద్రలను ధరించుటద్వారా, యజమాని చిహ్నములను సేవకుడు ధరింపవలెననుటను లోకమునకు ఉపదేశించుచున్నాడు.

**వ్యాఖ్యానము** :- పద్య మంగుళి విచ్ఛేద ఉరోవిన్యస్త మక్షరమ్,తన్నామగ్రహణంచేతి దాస్య మేతత్ చతుర్విధమ్ అనుసూక్తి దాస్యము నాల్గువిధములైనదని తెలుపు చున్నది.స్వామిని కీర్తించుచు పద్యములను రచించుట, ఏకలవ్యునివలె అంగుళిని ఛేదించి ఇచ్చుట, హృదయము నందు స్వామి పేరును వ్రాసికొనుట, అతని పేరును తనకు నిరూపకముగా కల్గియుండుట అనునవి నాల్గువిధములైన దాస్యములు. ప్రస్తుత శ్లోకమున ఉరోవిన్యస్తమక్షరమ్ అను దాస్యప్రకారము తెలుపబడినదని చెప్పనగును. స్వామి పేరును వ్రాసికొనుట అనగా స్వామి గుర్తును ధరించుటయే కదా! ఆదిశేషుడు ఇట్టిగుర్తులను దాల్చుటను కులశేఖరసూరి ఇనత్తుత్తి యణిపణ మాయిరఙ్గళ్ (రెండు శ్రీపాదచిహ్నములనుకల పడగలసహస్రమును 1-1)అని భూతయోగి "అణిమణికళ్ తుత్తిశేర్నాకత్తిన్"(96)అనియు ప్రస్తావించిరి. విష్ణు పురాణముననను స్వస్తికామల భూషణః అని కలదు.

> అనంతసేవిన స్సర్వే జీర్ణాం త్వచ మివోరగః ।
> విముచ్య విషయాసక్తిం శేషత్వే కుర్వతే రతిమ్ ॥ 19

**అర్థము** :- ఉరగః=సర్పము, జీర్ణాం త్వచమ్=జీర్ణించిన కుబుసమును,ఇవ=వలె, అనంతసేవినః=ఆదిశేషుని సేవించు,సర్వే=అందరు, విషయ+ఆసక్తిమ్= బాహ్య విషయములలోని ఆసక్తిని, విముచ్య=విడచి, శేషత్వే=శేషవృత్తియందు, రతిమ్= అనురాగమును, కుర్వతే=చేయుచున్నారు.

**తాత్పర్యము** :- సర్పము ప్రతిపర్వమునందు తన ఒంటిపైయున్న పాతబడిన పైపొరను (కుబుసమును) విడచుననుట లోకప్రసిద్ధమైన అంశము.శాస్త్రములలో యథోపాసనముగా ఫలముండునని తెలుపబడినది! ఆదిశేషుని భజించు భక్తులును

సర్పము కుబుసమును విడచునట్లే , బాహ్యసుఖమునందలి ఆసక్తిఅను కుబుసమును విడచుదురు. ఆదిశేషునివలె భగవానునకు సేవచేయుటలోనే ఆసక్తినికల్గి యుందురు.

వ్యాఖ్యానము :- "జీర్ణాం త్వచ మివోరగః సర్వే అనంతసేవినః విషయాసక్తిం విముచ్య" అనుటచే ఉపమాలంకారము కలదు.

శ్రీశ్రీశనామ సాహస్రీం యుగపత్ పరికీర్తయన్ ।
సహస్రవదనః శేషో నూనం ద్విరసనోఽభవత్ ॥ 20

అర్థము :- శ్రీ శ్రీశ=లక్ష్మియొక్క లక్ష్మీపతియొక్క, నామసాహస్రీమ్=సహస్ర నామములను, యుగపత్=ఒకేమారు, పరికీర్తయన్=కీర్తించుచున్నవాడై, సహస్ర వదనః=వేయినోళ్లనుకల,శేషః=అదిశేషుడు,ద్విరసనః=(ప్రతినోటిలో)రెండు నాల్కలను కలవాడు, అభవత్=అయ్యెను, నూనమ్=(ఇది)నిశ్చయము.

తాత్పర్యము :-లక్ష్మీదేవి, లక్ష్మీపతులు ఇద్దరియొక్క సహస్రనామములను, ఒకే మారు కీర్తించుచున్నవాడగుటచే సహస్రవదనుడైన ఆదిశేషుడు ద్విజిహ్వుడయ్యెను. ఇది నిజము.

వ్యాఖ్యానము :-సర్పములకు రెండునాల్కలు ఉండుటచే ద్విరసనములని, ద్విజిహ్వులని పేరు. గరుడుడు నాగులతో చేసికొనిన ఒప్పందమును అనుసరించి స్వర్గమునుండి అమృతమును తెచ్చి వారికిచ్చెను. అమృతపానము చేయుటకు ముందునాగులు స్నానమొనర్చుటకై పోగా, ఇంద్రుడు అమృతభాండమును స్వర్గమునకు తిరిగి కొనిపోయెను. అపుడు ఒకటి రెండు చుక్కలు అమృతకలశము నుండి ఆ కలశమును పెట్టిన దర్భలపై చిందెను. తిరిగి వచ్చిన నాగులు అమృతము కనపడకపోవుటచే నిరాశచెంది, ఆశతో దర్భలను నాకినవి. అపుడు పదునైన దర్భలచే వానినాల్కలు రెండుగా చీలినవి. అప్పటినుండి సర్పములు ద్విజిహ్వు లయ్యెను. ఈకథ మహాభారతములోని అమృతాహరణ వృత్తాంతములో కలదు. కావున సర్పజాతికి చెందిన అదిశేషుని ప్రతిముఖమునందును రెండు నాల్కలు ఉండుట సహజము. కాని కవి అందులకొక కారణమును ఉత్ప్రేక్షించుట విశేషము.

కేవలము నారాయణుని ఆరాధించుటకంటె లక్ష్మీసహితుడైన నారాయణుని కొలుచుట యుక్తము, శీఘ్రఫలప్రదమని పెద్దలు వచింతురు. జీవుని పాప

సంచయమును చూచిన నిరంకుశ స్వతంత్రుడైన స్వామి ఒక్కొక్కప్పుడు అతని ప్రార్థనను అంగీపరింపక అతనిని నిరాదరింప వచ్చును. అపుడు స్వామిచెంతనే యుండు లక్ష్మీదేవి పురుషకారమొనర్చుట ద్వారా స్వామిని సమాధానపరచి, అతడు ఆశ్రితుని అంగీకరించినట్లు చేయును. కావున లక్ష్మిని,లక్ష్మీపతిని ఇద్దరిని కొలుచుట నిశ్చయముగా ఫలప్రదమగును. ఈ అంశ మిచ్చట శ్లోకములోని పూర్వార్ధమున ప్రతిపాదింపబడినది. శ్రీలక్ష్మీనారాయణ సహస్రనామ స్తోత్రాదులు ఇందులకే అవతరించినవి.

అన్యోన్యం వైర ముత్సృజ్య ఫణీశ్వర ఖగేశ్వరౌ ।
శయనం వాహనం విష్ణో రభూతాం తత్పదాశ్రయౌ ॥ 21

అర్థము :-ఫణి+ఈశ్వర, ఖగ+ఈశ్వరౌ=ఆదిశేషుడు,గరుడుడును,అన్యోన్యం వైరమ్= పరస్పరవిరోధమును,ఉత్సృజ్య=విడచి,విష్ణోః=విష్ణువునకు,శయనమ్= పడుక,వాహనం (భూత్వా)=వాహనమును అయినవారై,తత్పద+ఆశ్రయౌ=అవిష్ణువు పదములను అశ్రయించినవారు అభూతామ్= అయిరి.

తాత్పర్యము :-సర్పములకు, గరుడునకు సహజవిరోధము కలదు. కావున ఆదిశేషునకు, గరుడునకుమధ్య వైరము ఉండు అవకాశము కలదు. కాని, వారిరువురును గొప్పభగవత్ భక్తులేకాక భాగవతపారతంత్ర్యమును కలవారు అగుటచే తమమధ్యగల విరోధమును విడచి, స్వామి శయ్యగా వాహనముగా మారి, ఆ స్వామి పాదములను ఆశ్రయించిరి.

వ్యాఖ్యానము :-ఆదిశేషునకు గరుడుని విషయమున ఏనాడును వైరము లేదనుట మహాభారతము ఆదిపర్వమున స్పష్టముగా కలదు.ఆ కారణముగా తనసోదరులు, పరస్పరము అసూయపడుచు గరుడుని ద్వేషించుచున్నారని బ్రహ్మతో పల్కి అతడు వాపోయెను. "సోదర్యా మమసర్వేఽపి భ్రాతరో మందచేతసః సహ తైః నోత్సహే వస్తుం తద్భవా ననుమన్యతామ్, అభ్యసూయంతి సతతం పరస్పర మమిత్రవత్,--న మర్షయంతి నను తాం సతతం వినతాంచ తే" (36-8,9,10) ఇత్యాది అచటి వాక్యములు స్మరణీయములు.అపుడు బ్రహ్మ ఆదిశేషుని భూమిని మోయుమని పల్కి, గరుడుని అతనికి మిత్రునిగా చేసెను- సుపర్ణంచ సహాయం వై భగవా నమరోత్తమః; ప్రాదా దనంతాయ తదా వైనతేయం పితామహః అను ఆ

సందర్భములోని వచనము కూడ గుర్తింపతగినది. వీరిద్దరు ఇట్లు పరస్పరము స్నేహభావముతో వర్తించుటకు ఇద్దరును భగవత్పాదాశ్రయులగుట హేతువు. కావున పదార్థహేతుకమైన కావ్యలింగము ఇందు కలదు. అట్లే, ఫణీశ్వర ఖగేశ్వరౌ శయనం వాహనం విష్ణోః" అనునపుడు క్రమాలంకారమును కలదు. ఇవి పరస్పర నిరపేక్షము లగుటచే తిలతండులరూప సంసృష్టియు కలదు. ఆదిశేష-గరుడులు ఇరువురు మైత్రిని కల్గి స్వామిని సేవించుటకు భగవానుని సర్వశక్తిత్త్వమే కారణమనుటను భక్తిసార మునీంద్రులు-"గరుడుని ధ్వజముగా గొనుటయేకాక ఆ గరుడుని వాహనముగా చేసికొంటివి. అందుచే పాలకడలిలో గరుడజాతికి సహజశత్రువన తగిన శేషునిపై పరుండుటను, అభిమానించుట అను కార్యము ఏ అభిప్రాయముతో స్వామీ!(19) అనుట ద్వారా ధ్వనింప చేసిరి. "సహజ శత్రువులని తలంచు సంసారమున ఇద్దరిని ఏకకంఠులనుచేసి వారిచే దాస్యమునుగొనుట నీయొక్క సర్వశక్తిత్త్వమును ప్రకాశింపచేయుటకొఱకు కదా! అని భావము" అను అచటి ఆచార్యుల వివరణమును స్మరణీయము.

వపుశ్శబ్దమనోదోషాన్ నిరస్య శ్రుతిగోచరమ్ ।
దర్శయంతం పరం బ్రహ్మ శేషం తం సముపాస్మహే ॥ 22

**అర్థము:**-వపుః+శబ్ద మనః దోషాన్=శరీరముయొక్క వాక్కుయొక్క మనస్సు యొక్క (త్రివిధకరణముల యొక్క),దోషములను,నిరస్య=పోగొట్టి,శ్రుతిగోచరమ్= వేదములందు కనుపించు, పరం బ్రహ్మ=బ్రహ్మస్వరూపమును, దర్శయంతమ్= చూపించు నట్టి, తమ్=ఆ, శేషమ్=ఆదిశేషుని, సముపాస్మహే=ఉపాసించెదము.

**తాత్పర్యము:**- శరీరము,వాక్కు, మనస్సు అనబడు త్రివిధకరణముల యొక్క దోషములను వరుసగా ఆయుర్వేదశాస్త్ర, వ్యాకరణశాస్త్ర, యోగశాస్త్రములను ప్రవర్తింపచేయుటద్వారా పోగొట్టి "**శాస్త్రయోనిత్వాత్**" అనునట్లు కేవలము వేద గోచరుడగు భగవానుని దర్శింపచేయు ఆదిశేషుని ఉపాసింతుము.

**వ్యాఖ్యానము** :-భక్తుడు భగవానుని సేవించుటలో మూడు సాధనములుగా శరీరము, వాక్కు, మనస్సు చెప్పబడినవి. వీనిలో ఏది దోషదుష్ట మైనను భక్తుడు భగవద్దర్శనము లభింపదు. కావున అవి మూడును దోషరహితములైయుండుట అత్యావశ్యకము. పతంజలి వ్యాకరణ మహాభాష్యకారుడుగా, యోగసూత్రకారుడుగా,

ఆయుర్వేదశాస్త్రప్రవర్తకుడుగా ప్రసిద్ధుడు. ఇట్లు ఈ మూడు శాస్త్రములను ప్రవర్తింప చేసిన అతడు భక్తుడు తన త్రివిధదోషములను పోగోట్టుకొనుటలో సహాయభూతుడై వేదవేద్యుడగు భగవానుని దర్శించుటకు కారణమగుచున్నాడు. పరమపదమున సింహాసనమై, పాలకడలిలో, దేవాలయములలో శయ్యయై యుండి స్వామిని భక్తులు దర్శించునట్లు చేయుచున్నారు. అట్టి మహోపకారకుడును, ఆచార్యుడును అగు ఆదిశేషుని ఉపాసింతుమని తాత్పర్యము. ఈ శ్లోకమునకు అనుగుణముగా

"పాతంజలమహాభాష్యచరకప్రతిసంస్కృతైః,
మనోవాక్కాయదోషాణాం హర్త్రేఽహి పతయే నమః"

"యోగేన చిత్తస్య పదేనవాచాం మలం శరీరస్యచ వైద్య కేన,
యోఽపాకరోత్ తం ప్రవరం మునీనాం పతంజలిం ప్రాంజలి రానతోస్మి! అను ప్రార్థనాశ్లోకములు స్మరణీయములు.

పతంజలిమహర్షి చరకమహర్షులవలె శేషాంశసంభూతులైన భగవద్రామానుజ మునీంద్రులును శ్రుతిమాత్ర(వేదములందు; చెవికిమాత్రము) గోచరమగు ఆభగవతత్త్వ వైభవమును దర్శింపజేసినారు. ఎట్లనగా! స్వకాన్తా పరవశుడైయున్న ధనుర్దాసునకు శ్రీరంగ క్షేత్రమునందలి శ్రీరంగనాథుని దివ్యమంగళ విగ్రహ సౌందర్యమును సేవింపజేసి భాగవతోత్తముని గావించినారు. ఇట్లే తిరునారాయణ పురమున (మేల్‌కోట్టై, కర్ణాటక) తిరునారణన్ సన్నిధి జీర్ణోద్ధరణగావించి ఉత్సవమూర్తియగు సంపత్కుమార స్వామివిగ్రహమును ఢిల్లీపాదుషా అంతః పురమునగలదని తెలిసి, అచటికి పరివారముగా వేంచేసి, తమ స్వామిని తమకు ఇప్పించమని ఆ పాదుషాను కోరగా అతడు "ఆ స్వామి మీ స్వామియగుచో మీరే అయనను పిలువండి. వస్తాడుగదా!" అని పరిహాసమునకై అన్నాడట. అంతట శ్రీరామానుజులు ఒక్కక్షణము ధ్యాననిమీలితనేత్రులై "సంపత్కుమారరే వారుమ్, (సంపత్‌కుమారా! రండి) అనిఅత్యంతప్రేమతో ఆహ్వానించినారుట. అంతట భక్తవశంవదుడగు ఆస్వామి చిన్నిపిల్లవానివలె బుడిబుడినడకలతో కిలకిలనవ్వుచు వచ్చి శ్రీమద్రామానుజుల అంకసీమ నధిరోహించినాడని ఐతిహ్యము ప్రసిద్ధముగా నున్నది. ఇదియు ఇచట అనుసంధేయము. ఇట్లే శ్రీరంగాది దివ్యక్షేత్రములలో ఆదిశేషుడు స్వామిని తన ఒడిలో పరుండబెట్టుకొని "భక్తవరేణ్యులారా! శ్రుతిగోచర

మైన పరబ్రహ్మమే ఇతడు.అపాదచూడము ఇతని ఈ దివ్య సౌందర్యమును సందర్శించి తరించండి. అనుచున్నట్లు సేవ సాయించు చుండును.

శ్రీభట్టనాథసూరియు శీదక్కడలుళ్ అను వింశతికలో యశోదా భావనతో "పేదక్కుళవి ప్పిడిత్తుచ్చువైత్తుణ్ణమ్ పాదక్కమలజ్గళ్ కాణీరే! పవళవాయిార్ వన్దు కాణీరే!. ("అమ్మలారా! నా ఒడిలోని ఈ చిన్నిశిశువు తన శ్రీపాదములను నోట నుంచుకొని ఆ రసము నాస్వాదించుచున్నాడు. రండి. పద్మములను బోలిన ఈతని శ్రీపాదములను దర్శించండి.") అను ఇరువది పాశురములలో (గేయములలో) పాదాది కేశపర్యంతము శ్రీబాలకృష్ణుని సౌందర్యమును దర్శింపజేసిన విషయము ఇచట స్మరింపదగియున్నది.

శేషతల్పేన రంగేశః శేషాద్రౌ వేంకటేశ్వరః ।
హస్తిశైలేశ్వరః శేషభూషణేన విరాజతే ॥ 24

**అర్థము** :-రంగేశః=ఆ శ్రీరంగనాథుడు,శేషతల్పే=శేషతల్పమునందు,విరాజతే= విరాజిల్లుచున్నాడు. వేంకటేశ్వరః=వేంకటేశ్వరుడు,శేష+అద్రౌ=శేషాద్రియందు, విరాజతే=విరాజిల్లు చున్నాడు.హస్తిశైల+ఈశ్వరః=హస్తిగిరీశుడగువరదరాజస్వామి, శేషభూషణేన=శేషాకార భూషణముతో,విరాజతే=విశేషముగ ప్రకాశించుచున్నాడు.

**తాత్పర్యము**:- శేషతల్పమునందు శ్రీరంగనాథుడు; శేషాద్రియందు శ్రీనివాసుడు; శేషాకార భూషణముతో వరదరాజస్వామి విరాజిల్లుచున్నారు.

**వ్యాఖ్యానము** :-"కావేరీ విరజా సేయం వైకుంఠం రంగమందిరమ్, స వాసుదేవో రంగేశః ప్రత్యక్షం పరమంపదమ్." అను సుప్రసిద్ధశ్లోకము శ్రీరంగమందిరము సాక్షాత్తు వైకుంఠనగరమని తెలుపుచున్నది. కావున శ్రీరంగములో స్వామికి శయ్యగానున్నవాడు సాక్షాత్తు ఆదిశేషుడనుట స్పష్టము. శ్రీవేంకటేశ్వరుడు అధివసించియున్న కొండకు శేషాచలమని పేరు. ఆదిశేషుడే ఆ కొండగా మారుటచే అట్టిపేరు దానికి కల్గెనని భవిష్యోత్తరపురాణములోని వేంకటేశ్వర మాహాత్మ్యములో (1-85 నుండి132శ్లో) కలదు. ద్వాపరయుగమున ఆదిశేషునకు, వాయుదేవునకు కల్గినస్పర్ధలో వాయుదేవుని వేగమునకు ఆదిశేషుడు వేంకటాచలముపైకి చేరెనని, భగవానుడు అప్పటినుండి పర్వతముగామారిన ఆదిశేషుని శీర్షస్థానమగు తిరుమల పై వేంచేసియున్నాడని అచట తెలుపబడినది. ఆకాశములో ఎక్కువ ఎత్తునకు

పోయి విహంగ వీక్షణచేసినచో తిరుమల పర్వతశ్రేణులు సర్పరూపములోనున్నట్లు, తలగా చెప్పదగినచోట తిరుమల,తోకగా చెప్పదగినచోట శ్రీశైలము,పాముచుట్టగా చెప్పదగినచోట అహోబిలము అనుక్షేత్రములున్నవని ఆధునిక పరిశీలకులును తెలుపుచున్నారు. ఈ వివరణము శ్రీఎన్.రమేశన్‌గారి "హిస్టరీ ఆఫ్ తిరుపతి"అను ఆంగ్లగ్రంథము ప్రారంభములో శ్రీసాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారి "తిరుపతి-శ్రీవేంకటేశ్వర" అను ఆంగ్లగ్రంథములో చూడవచ్చును.

కంచిలోనున్న వరదరాజస్వామి భుజమునకు ధరించు ఆభరణములలో ఆదిశేషుని రూపములోనున్న ఆభరణమొకటి కలదు. కూరేశుల వరదరాజస్తవము లోని "నీలమేఘ నిభం --అనంతశయం త్వామ్"(23) అను శ్లోకములోని **'అనంతశయమ్'** అనుపదమును వివరించునపుడు శ్రీప్ర.భ.కాంచీ అణ్ణాస్వామివారు తమవ్యాఖ్యలో ఈవిషయమును సూచించిరి. ఈ నాగాభరణము స్వామి పైనధరించు ఆభరణమేకాని, విగ్రహముతో దీనికి సంబంధము లేదనియు వారు సెలవిచ్చిరి.

విష్ణుక్షేత్రములలో ముఖ్యములైన నాల్గు క్షేత్రములుగా చెప్పబడు శ్రీరంగము, కంచి, తిరుమల,యాదవాద్రులలో మొదటి మూడు క్షేత్రములలోగల అర్చామూర్తులకు ఆదిశేషునితోగల సంబంధము ప్రస్తుతశ్లోకమున తెలుపబడినది. నాల్గవదైన యాదవాద్రియు ఆదిశేషునిరూపమే అని నారదీయపురాణములోని యాదవగిరిమాహాత్మ్యమున కలదు. "అర్చితః కృష్ణరామాభ్యాం తత్రాహం ద్వాపరే యతః, తేన యాదవశైలోఽయమితి లోకేషు కథ్యతే, సహస్రశిఖరస్సోఽయం సాక్షాచ్ఛేషాత్మకో గిరిః, వైకుంఠాదపి యత్రాహం రమయా సహితో రమే"(1-33,34) అను అచటి వచనములు గమనింపదగినవి. ఇట్లు పై నాల్గు క్షేత్రములతో ఆదిశేషుడు సాక్షాత్‌సంబంధము కల్గియుండుట విశేషము.

**భగవత్పాదుకాత్వం తే మహత్త్వాపాదకో గుణః ।**
**శిరసా ధారయంతి త్వాం భక్త్యా శేష! యత స్సమే॥** **25**

అర్థము :- శేష=ఆదిశేషమూర్తీ! భగవత్పాదుకాత్వమ్=భగవానునకు పాదుకలుగా అగుట, తే=నీకు, మహత్త్వ+ఆపాదకః=గొప్పదనమునుకల్గించు, గుణః=గుణము, యతః= ఏగుణములవలన, సమే=అందఱును, త్వామ్=నిన్ను, భక్త్యా=భక్తితో, శిరసా =శిరస్సుతో, ధారయంతి=ధరించుచున్నారు.

**తాత్పర్యము** :-ఆదిశేషా! నీవు భగవానునకు పాదుకలుగాఅగుట నీకు గొప్ప దనమును కలిగించు గుణము.దానివలన ఆ భగవానుని పాదుకలరూపములో నున్న నిన్ను భక్తులందఱు భక్తితో తలపై ధరింతురు.

**వ్యాఖ్యానము** :-సరోయోగి "నిన్ఱాల్ మరవడియామ్" అని, శ్రీయామునులు "నివాసశయ్యాసనపాదుకా" అని పల్కిన సూక్తులనుబట్టి ఆదిశేషుడు భగవానుని పాదుకలగునని చెప్పబడినది. ఆదిశేషుడు పలురూపములలో స్వామిని సేవించినను ఇట్లు పాదుకలై సేవించుట అతని దాస్యమునకు పరాకాష్ఠ. భక్తుడు ముఖ్యముగా భావించు భగవానుని పాదముల సంబంధము ఆస్థితిలో పూర్ణముగా కల్గును కదా! అందరికిని రక్షయగు భగవత్పాదములకుకూడ తాను రక్షఅగుట పాదుకాస్వరూపము లోని విశేషము. ఇట్టి వైశిష్ట్యమును గమనించిన భక్తులు పాదుకారూపుడైన ఆదిశేషుని తలతోదాల్చి, తమకు ఆ భక్తాగ్రేసరునిపైగల ఆదరాతిశయమును ప్రకటించుకొను చున్నారని తాత్పర్యము. విష్ణ్వాలయములలో భగవానుని పాదుకలకు ప్రతిరూపముగా చెప్పబడు శఠారి, లేక శఠకోపముకూడ ఆదిశేషుని రూపమేనని దీనివలన సూచింపబడినది. ఆచార్య హృదయమను గ్రంథములో తత్కర్తయగు నాయనార్ "శఠగోపులు నిత్యులలో ఒకరిరూపమా!" అని విజ్ఞులు వితర్కింతురని పల్కిరి. "నిత్యోఽథముక్త ఉత తద్గుణ కో ముముక్షుః" ఇత్యాది పరాంకుశ పంచవింశతి స్తుతి సూక్తియు ఇచట స్మరణీయము.

> భాగవత శేషతాయాః మహత్త్వ మావేదయ న్నయం శేషః ।
> గరుడస్య వామపాదే విష్ణోర్వాహస్య వీరకటక మభూత్ ॥ 26

**అర్థము** :- అయం శేషః=ఈ ఆదిశేషుడు, భాగవతశేషతాయాః= భాగవతశేషత్వము యొక్క మహత్త్వమ్=గొప్పతనమును,ఆవేదయన్=తెలుపుచు,విష్ణోః వాహస్య= విష్ణువునకు వాహనమగు,గరుడస్య=గరుడునియొక్క, వామపాదే=ఎడమపాదమందు, వీరకటకమ్= వీరకడియము, అభూత్ =అయ్యెను.

**తాత్పర్యము** :-ఇంతవరకు ఆదిశేషుని భగవచ్ఛేషత్వమునుగూర్చి పల్కిన కవి చివరగా భగవచ్ఛేషత్వపరాకాష్ఠ అగు భాగవత శేషత్వమును గూర్చి తెలుపుచున్నారు. ఈ ఆదిశేషుడు భగవచ్ఛేషభూతుడేకాక భాగవతశేషత్వమును కలవాడు. భాగవత శేషత్వము యొక్క గొప్పతనమును తెలుపుచు ఇతడు విష్ణువునకు వాహనమై,

దాస్యమును చేయు గరుడుని వామపాదమునకు వీరకడియము రూపమున ఆభరణముగా అయ్యెను.

వ్యాఖ్యానము:-సాత్త్వతసంహితలో"అనంతో వామకటకఃయజ్ఞసూత్రం తు వాసుకిః' ఇత్యాదిగా ఆదిశేషుదు ,వాసుకి మున్నగు ఎనిమిదిమంది సర్పరాజులు గరుడునకు ఆభరణములై యుందురని తెలుపబడినది .శ్రీదేశికులును గరుడపంచాశత్‌లో "వామే వైకుంఠశయ్యా ఫణిపతి కటకో" (36) ఇత్యాదిగా ఈ అంశమును స్తుతించిరి. ఇట్లు భగవద్భకుల్తలో అగ్రేసరుడైన గరుడుని వామపాదమునకు ఆభరణమయ్యె ననగా తన భాగవతశేషత్వపరాకాష్ఠను తెలుపుకొనినట్లే కదా! భగవానునికి దాసుల గుటకంటె భగవద్భక్తునకు దాసులగుట మిక్కిలి విశేషమని అపుడే భగవద్భక్తికి పూర్ణత సిద్ధించునని శాస్త్రములు తెలుపుచున్నవి. అట్టి భాగవతశేషత్వమున నందు ఉనికను కల్గియుండుట మిక్కిలి దుర్లభమని అనుట – "సంసార విషవృక్షస్య ద్వే ఫలే హ్యమృతోపమే, కదాచిత్ కేశవే భక్తిః తద్భక్తైర్వా సమాగమః" ఇత్యాది సూక్తులు స్పష్టీకరించుచున్నవి. అట్టి మహనీయమైన, అరుదైన భాగవతశేషత్వమును పరి పూర్ణముగా కల్గినవాడు ఆదిశేషుడు. తాను కల్గియుండుటయేకాక ఆచరణము ద్వారా ఇతరులకును ఆదర్శప్రాయుడై నిలచెను. స్తుతిలోని ఈ శ్లోకము మాత్రము ఆర్యావృత్తమున నిబద్ధము.

శేషః పీతాంబరం విష్ణోః తద్విష్ణుధృత మంబరమ్ ।
శేషవస్త్రమితి ఖ్యాత్యా భక్తసమ్మాన్యతాం గతమ్ ॥ 27

అర్థము :-శేషః= ఆదిశేషుడు, విష్ణోః=శ్రీమహావిష్ణువునకు, పీతాంబరమ్=( ధరించు) పచ్చనివస్త్రము, తత్=ఆ, విష్ణుధృతమ్=విష్ణువుచే దాల్చబడిన,అంబరమ్=వస్త్రము, శేషవస్త్రమ్= శేషవస్త్రము,ఇతి=అను,ఖ్యాత్యా=పేరుతో, భక్తసమ్మాన్యతామ్=భక్తుల గౌరవమును, గతమ్ = పొందినది.

తాత్పర్యము :- ఆదిశేషుదు భగవానునకు ధరించు పీతాంబరమై సేవించుచున్నాడు. అట్లు భగవానుడు ధరించి విడచిన వస్త్రము శేషవస్త్రమను పేరుతో లోకమున భక్తుల గౌరవమునకు పాత్రమై యున్నది.

వ్యాఖ్యానము :- విష్ణ్వాలయములలో భగవానుడు ధరించి విడచినవస్త్రమును భక్తులకు సమ్మాన చిహ్నముగా ఇత్తురు. అవస్త్రమునకు సంప్రదాయ పరిభాషలో

శేషవస్త్రమని పేరు.ఇచట శేషమనగా ధరించి విడచిన అని అర్థము. కాని, ఇచట అ అర్థమే కాక వేరొక అర్థమును చెప్పతగియుండుట తెలుపబడినది. స్వామి దాల్చు పీతాంబరము సాక్షాత్తు ఆదిశేషుడే కావున, శేషరూపమైన ఆ వస్త్రమునకు శేషవస్త్రమని పేరుకల్గుట యుక్తము కదా! ఇట్లు పరమభక్తునకు ప్రతిరూపమైన శేషవస్త్రమును భక్తులు అత్యంతము గౌరవముతో గొందురు అని తాత్పర్యము.

దుర్మతిం జననీం త్యక్త్వా శ్రీపతిం శరణం గతః ।
తేన దత్త్వాభయోఽనంతః తస్యాసీ న్నిత్యకింకరః ॥ 28

**అర్థము** :- దుర్మతిమ్=చెడ్డబుద్ధిగల, జననీమ్=తల్లిని(కద్రువను),త్యక్త్వా=విడచి, శ్రీపతిం=శ్రియఃపతిని, శరణం గతః=శరణుపొందినవాడై, తేన=ఆ భగవానుని చేత, దత్త+అభయః=అభయమొసగబడిన,అనంతః=ఆదిశేషుడు,తస్య= అస్వామికి, నిత్యకింకరః=నిత్యము సేవించువాడు, ఆసీత్=అయ్యెను.

**తాత్పర్యము** :-చెడ్డబుద్ధిగల కద్రువను వీడి, భగవానుని శరణుజొచ్చిన ఆదిశేషునకు ఆ భగవానునివలన అభయము లభించెను.పిమ్మట ఆదిశేషుడు భగవానునకు నిత్యము పరిచర్యను చేయువాడయ్యెను.

**వ్యాఖ్యానము** :-కద్రువ,వినతయు కశ్యపప్రజాపతికి భార్యలు.కద్రువకు నాగులు, వినతకు అనూరుడు,గరుడుడును జన్మించిరి.కద్రువ మాయోపాయముతో సవతియగు వినతను దాసిగా చేసికొనుటకు ప్రయత్నించుటను చూచిన ఆదిశేషుడు ఆమెను విడచి,ఆమె శాపమువలన కలుగు భయమును భగవానుని సాన్నిధ్యమును చేరుటద్వారా పోగొట్టు కొనెను.తల్లిని ఆదిశేషుడు విడచి వెడలిన వృత్తాంతము మహాభారతము ఆస్తీక పర్వమున కలదు.

గర్గాయ మునయే జ్యోతిర్విద్యాం య స్సముపాదిశత్।
దేవర్షిగణసంపూజ్యం త మనంత ముపాస్మహే॥ 29

**అర్థము** :- యః=ఏ ఆదిశేషుడు,గర్గాయ మునయే=గర్గుడను మునికి, జ్యోతిర్విద్యామ్ =జ్యోతి శ్శాస్త్రమును, సముపాదిశత్=ఉపదేశించెనో,దేవర్షి గణసంపూజ్యమ్= దేవతల, ఋషుల సమూహముచే పూజనీయుడగు, తమ్=ఆ, అనంతమ్=ఆది శేషుని, ఉపాస్మహే=ఉపాసింతుము.

**తాత్పర్యము** :-గర్గుడను మునికి జ్యోతిశ్శాస్త్రమును ఉపదేశించినవాడు, దేవతలకు

ఋషులకు పూజనీయుడు, అనంతకల్యాణగుణములను కలవాడగు ఆదిశేషుని ఉపాసింతుము.

వ్యాఖ్యానము:- శ్రీవిష్ణుపురాణములోని-"యమారాధ్య పురాణర్షిః గర్గో జ్యోతీంషి తత్త్వతః, జ్ఞాతవాన్ సకలంచైవ నిమిత్త పఠితం ఫలమ్" అనియు, "యోఽనంతః పఠ్యతే సిద్ధైః దేవదేవర్షిపూజితః" అనియు కల సూక్తులను స్మరింపనగును. ఆదిశేషుడు జ్యోతిశ్శాస్త్ర ప్రవర్తకుడనుటకు శ్రీదేశికులు"ప్రకృష్ట విజ్ఞాన" అను స్తోత్రరత్నసూక్తిని వివరించుచు- "పంచవిధ జ్యోతిస్సిద్ధాంత ప్రవర్తకత్వేన జ్ఞాన ప్రకర్ష ఉక్తః" అని పల్కుటద్వారా తెలిపిరి.

## నాగబంధశ్లోకము

వందేఽనన్తం ముదా భాన్తం రుచా శ్వేతం సురార్చితమ్।
హరిపాదాబ్జ శరణం తదీయాస్యాబ్జ తోషణమ్॥ 30

అర్థము :- ముదా= సంతోషముతో, భాంతమ్=ప్రకాశించుచున్నవాడు, రుచా= కాంతితో, శ్వేతమ్=తెల్లనివాడు, సుర+అర్చితమ్=దేవతలచే అర్చింపబడువాడు, హరిపాదాబ్జ=భగవానుని పాదాబ్జములను, శరణమ్=శరణముగాగలవాడు, తదీయ= ఆ భగవానుని యొక్క, ఆస్య+అబ్జ=ముఖము అను పద్మమునకు, తోషణమ్= సంతోషమును కల్గించువాడును అగు, అనంతమ్=అనంతుని, వందే=నమస్కరించు చున్నాను.

తాత్పర్యము :-ఎల్లప్పుడు భగవానుని సేవించుటవలన కలిగిన ఆనందముతో ప్రకాశించువాడు, తెల్లనిరంగును కలవాడు, దేవతలచే అర్చింపబడువాడు, భగవానుని పాదపద్మములను శరణముగా గలవాడు, ఆ స్వామి ముఖపద్మమునకు సంతోషమును కలిగించువాడగు అనంతుని నమస్కరింతును.

వ్యాఖ్యానము:- ప్రకృతశ్లోకము నాగబంధములో కూర్పబడినది. ముందుగా మొదటి పాదములోని"వందేఽనంతమ్" అను భాగమును ఎడమవైపునుండి కుడికి వ్రాయవలెను. పిమ్మటగల"ముదా భాంతమ్" అనుభాగమును కుడినుండి ఎడమవైపు వ్రాయవలెను. ఈ రెండుభాగములలో చివరగల"న్తమ్" అను అక్షరము సమానము.

అట్లే ద్వితీయపాదములోని "రుచా శ్వేతమ్"అనుటను ఎడమనుండి కుడికి, "సురార్చితమ్" అనుటను కుడినుండి ఎడమకు,వ్రాయవలెను. ద్వితీయార్ధములోని మొదటిసగమును (తృతీయపాదమును ఎడమవైపున ప్రారంభించి ఊర్ధ్వముఖముగా వ్రాయుచు"శరణమ్" అను పదమును పడగలోనుండునట్లు, "బ్జ"అను నాల్గవ అక్షరమును పడగ ప్రారంభములోనుండునట్లు నిక్షేపింపవలెను. ఇట్లే చతుర్థ పాదమును కుడివైపునుండి ఎడమకు వ్రాయవలెను. అపుడు ఈ రెండుపాదములలో మధ్యగల బ్జ అను అక్షరము, చివరగల ణమ్ అను అక్షరమును సమానమగుటచే కలియును. ఈ విధముగా నాగాసనాసీన నారాయణబంధ చిత్రమును వ్రాయ నగును. ఈ క్రమమును ఈ క్రింది చిత్రమున గమనింపవచ్చును.

శ్రీమతే విష్ణుభక్తాయ శంఖచక్రాదిధారిణే।
వారుణీకీర్తిసహితాయానంతాయాస్తు మంగళమ్॥ 31

అర్థము:- శ్రీమతే=కైంకర్యలక్ష్మిని కలవాడు, విష్ణుభక్తాయ=విష్ణుభక్తుడును, శంఖ చక్రాదిధారిణే=శంఖము చక్రము మొదలగు ఆయుధములను ధరించువాడు, వారుణీకీర్తి సహితాయ=వారుణీదేవి, కీర్తిదేవులతో కూడినవాడును అగు, అనంతాయ =అనంతునకు, మంగళమ్ అస్తు=మంగళమగుగాక!

తాత్పర్యము :- కైంకర్యలక్ష్మినికలవాడు, విష్ణుభక్తుడు, శంఖచక్రాది ఆయుధములను ధరించు వాడు,వారుణి, కీర్తి అను ఇద్దఱు భార్యలను కలవాడును అగు అనంతునకు మంగళమగుగాక!

వ్యాఖ్యానము:-ఆదిశేషుడు శంఖచక్రాదులను ధరించియుండుననుటను తమిళనాడులో గల శీఱుపులియూర్ అను క్షేత్రములో గమనింపవచ్చును. పాద్మ సంహితలో వారుణి, కాంతి అను ఇద్దఱుభార్యలు ఆదిశేషునకు కలరని తెలుప బడినది.

ఇమాం స్తుతి మనంతస్య భక్త్యా నిత్యం పఠంతి యే।
సర్వబాధా న తేషాం స్యాత్ పుత్రిణ స్స్యుః హరేః ప్రియాః ॥ 32

అర్థము :- అనంతస్య=అనంతుడనబడు ఆదిశేషునియొక్క,ఇమామ్=ఈ, స్తుతిమ్= స్తవమును, నిత్యమ్=ప్రతిదినము, భక్త్యా=భక్తితో, యే= ఎవరు, పఠంతి=చదువుదురో,

తేషామ్=వారికి, సర్పబాధాః=సర్పములవలన బాధ, న=కలుగదు. పుత్రిణః= పుత్రులను కలవారు, హరేః ప్రియాః= హరికి ప్రియులైనవారును, స్యుః=అగుదురు.

తాత్పర్యము:- ఆదిశేషుని స్తుతించు ఈ స్తవమును ఎవరు నిత్యము పఠింతురో వారికి సర్పబాధ కలుగదు. వారు సత్సంతానవంతులగుదురు. భగవానునకు ప్రీతిపాత్రులగుదురు.

వ్యాఖ్యానము :-ఈ స్తోత్రమును పఠించుటచే కలుగు ఫలము ఇందు తెలుపబడినది. హరేఃప్రియాః అను ప్రయోగమునకు **ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమ్ అహం స చ మమ ప్రియః** అను గీతాసూక్తి ప్రకారము స్వరూపజ్ఞానముకలవారై, భగవానునకు ఇష్టులగుదురని తాత్పర్యము. కావున ఈస్తుతి పఠనమువలన భౌతికలాభమేకాక, ఆధ్యాత్మికలాభమును కలుగునని సారము. లేక 'జ్ఞానీ త్వాత్మైవ మే' అని భగవానునిచే కీర్తింపబడిన మహాత్ములలో మొదటివాడగు అనంతుని స్తుతించు ఈ కృతిని పఠించినచో తన పుత్రుని కీర్తించినపుడు సంతోషించు తండ్రివలె భగవానుడును ఆనందించును. కావున అట్లు స్తుతించు వారు స్వామికి ప్రియులు అగుదురు. వేదాంతదేశికులును గరుడదండకము చివరలో 'గరుడధ్వజతోషాయ గీతో గరుడదండకః' అని పల్కిరి కదా!

తత్క్రతున్యాయానుసారము "ప్రకృష్ట విజ్ఞాన బలైకధామని" అని పొగడబడు ఆదిశేషుని ఈ స్తవమును పఠించుటద్వారా ఆరాధించినవారికి ప్రకృష్టమైన జ్ఞానము బలమును చేకూరును.

సమస్త సన్మంగళాని సన్తు.

64

త్వరలో

మునివాహనసూరి ప్రణీత

# అమలనాదిపిరాన్

శ్రీ సేవావాఖ్య

ఉ.వే.శ్రీమాన్ ఈ.ఏ. సింగరాచార్యస్వామివారు

